# రుచికరమైన, పుష్టికరమైన
# బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు




## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు

బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు మరీ అంత ప్రత్యేకమైన రుచి గలిగి ఉండటానికి ఏమిటి కారణం? వాటిలో గల సమృద్ధినిచ్చే, సంపూర్ణమైన పుష్టినిచ్చే లక్షణాలే. పిల్లలకు యివి యిష్టం, పెరుగుతారు ఎంతో బాగా వాటితో. బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు ఎదిగే మీ పిల్లలకు ఎంతో మంచివి.

బ్రిటానియా

**బిస్కట్లు అత్యుత్తమమైనవి**

లింటాస్-BBC.GLX-6-140 TL

# ఉత్తరాలు

## దీపావళి సంచిక

దీప లక్ష్మి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచిక చాలబాగుంది. సినీ నటుల, నటీమణుల ముఖచిత్రాలతో విసుగెత్తిపోయిన మాకు దీపలక్ష్మి ముఖచిత్రం రిలీఫ్‌ను కలిగించింది. శ్రావణ సంధ్య మొదట్లోనే భారంగా వుంది గెలుపునాదే సీరియల్ బావుంది. రామలక్ష్మిగారి ప్రశ్నావళిమన పత్రికకే హైలైట్. మిగతా శీర్షికలు, కథలు కూడచాల బావుంటున్నాయి.

జి. మంజుల (క్రాప)

* * *

దీపసుందరి దీపావళి సంచిక చూడ ముచ్చటగా ఉంది. కథలలో చెంబుకథ హాస్యంగా చదవటానికి ఇంటరెస్ట్‌గా ఉంది. సీరియల్ కథల్లో "శ్రావణ సంధ్య" చాలాబాగుంది. మొదటి సంచిక తరువాత కథ అనుకోని మలుపు తిరిగి చాలా బాగుంది. "గెలుపునాదే" అంత ఇంటరెస్ట్‌గా లేకపోయినా బోర్ కొట్టించకుండా కథ నడుస్తుంది.

గంటా తాతారావు (నవాబుపాలెం)

* * *

7—11—1975 న వెలుబడిన 'దీపావళి' సంచిక ఆంధ్ర సచిత్ర వారపత్రిక అట్టమీది బొమ్మ 'దీపలక్ష్మి' చూడ ముచ్చటగానున్నది

డాక్టరు దాశరధి వ్రాసిన దీపాల మందారమంజరి (కవిత) చాల ఇంపుగా మన్నది.

పూదరి యాదగిరిగౌడ్ (హుస్నాబాద్)

## సీరియల్

శ్రావణ సంధ్య మొదట్లో బాగలేదు కాని ఇప్పుడు క్రొత్త మలుపులు తిరుగుతుంది. గెలుపునాదె ఒక మాదిరిగా ఉంది. చెంబుకథ సహజంగా లేదనిపిస్తోంది. దీపాల మందారమంజరి కవిత బాగుంది.

కె. శ్రీదేవి (గుంటూరు)

* * *

ముద్దుల మూట గట్టు చక్కని "ముఖచిత్రంతో" దీపావళి సంచిక కన్నుల పండువుగా ఉంది. ఈ మధ్యనే ప్రారంభమైన కొత్త సీరియల్ శ్రావణ సంధ్య వూహాకందని, వూహించని, సరికొత్త మలుపులు తిరుగుతుంది.

ఆర్. సావిత్రి, ఆర్. సురేష్, కె. కన్యాకుమారి (నందిగామ)

## కథలు

కథలలో "సుపుత్రుడు" కథ బాగుంది. సోమసుందర్‌గారి రాలిన ముత్యాలు పత్రికకు ఆణిముత్యాల్లా ఉంటున్నాయి.

కార్టూన్ను మరీ తగ్గించేశారు. దయచేసి కార్టూన్ను ఎక్కువగా వెయ్యండి.

పి. రఘురాం (సూళ్ళూరుపేట)

* * *

పత్రికలో 'సునీత కాపురం' భర్త, తను చెడు తిరుగుళ్ళుపోయినా, తనభార్యమాత్రం పవిత్రంగా ఉండాలని కోరుకుంటాడు, మనస్ఫూర్తిగా. తన అపవిత్రతకి తనలోని బలహీనత కారణం అని తెలుసుకున్నా దాన్ని జయించలేని అసమర్థత అతన్ని డిఫోవర్ చేస్తుంది. అలాంటప్పుడు ఏదో ఒక యాదృచ్ఛిక శక్తిగాని, ఏదో అనుకోని సంఘటన గాని అతన్నిమార్చాలి. ఇందులో సారది ఆప్యాయత అనురాగం స్నేహం సునీతను దగ్గరగా తీసుకుని వోదార్చితే, అదే సమయానికి భర్త రావడం, చూసి అనుమానించడం, ఆ తర్వాత మారడం సునీత కాపురం నిలబడ్డం బాగానేఉంది.

ప్రమద్వర (వాల్తేరు)

* * *

మీరు ప్రచురించిన "సునీతకాపురం" చదివేను. అన్ని రోజులనుంచి సరిగ్గా వుండని శేఖరం, సారథి అన్న ఆ రెండు మాటలకు మంచివాడవడం చాల ఆశ్చర్యంగా ఉంది.

జె. బాల నాగలక్ష్మి. (నరసరావుపేట)

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం : 28-11-'75
రాక్షసనామసం కార్తీకమాస బ. దశమి
సంపుటము : 69 సంచిక : 12

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా - రు. 33-80
ఆరుమాసాల చందా - రు. 16-90
విడిప్రతి వెల 60 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.

## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
జయశ్రీ. టి
(ఫొటో : కాంతీలాల్ ఖత్రీ)



# హైదరాబాద్ నోట్ బుక్ — తిరుమల రామచంద్ర

### మా తెలుగు తల్లికి మల్లెపూదండ

నేనుమరణించినా నాపాటలు మరణించవన్నాడు రవీంద్ర కవీంద్రుడు ఒక సందర్భంలో. ఆపాట జనప్రియమైతే దాని ఆయుస్సు సహస్ర శతాబ్దాలు. మిత్రుడు శ్రీ శంకరంబాడి సుందరాచారి నాలుగు దశాబ్దాల క్రితం అలవోకగా వ్రాసిన "మా తెలుగుతల్లికి మల్లెపూదండ" గేయాన్ని రాష్ట్ర సమైక్య సాధనంగా ప్రజలేపంగా, మూడు ప్రాంతాలను కలిపే ముప్పేటముడిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భావించడం, దాని జాతీయగీతం తర్వాత ప్రతి సమావేశ ప్రారంభంలోను పాడాలని అనతి ఇవ్వడం ఎంతో సముచితంగావున్నాయి. శంకరంబాడి ఈఒక్కపాటతోనే యోగీశ్వరులలాగ చిరస్మరణీయుడయ్యాడనేనాసంపూర్ణ విశ్వాసం. ఈ నిర్ణయం చేసినందుకు రాష్ట్ర ప్రభుత్వాన్ని, విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావును అభినందిస్తున్నాను.

### ఆంధ్రప్రదేశ్ అవతరణ వార్షికోత్సవం

నవంబరు 1 వ తేదీన 20 వ ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవం ఈ మారు రాష్ట్రమంతటా మహోత్సవంగా జరగడంతోపాటు, జంటనగరాలకు దీపావళితో కలిసి రావడంవల్ల నూతన శోభచేకూర్చింది. ప్రభుత్వం నవంబరు 1 వ తేదీని సెలవుదినంగా ప్రకటించింది. రవీంద్ర భారతిలో ముఖ్య మంత్రి శ్రీ వెంగళరావు పంచాయతీరాజు రజతోత్సవాన్ని, చార్‌మినార్‌వద్ద హైదరాబాద్ పట్టణ ప్రాంతాభివృద్ధి సంస్థను, పశుగణ, గ్రామీణాభివృద్ధి శాఖా మంత్రి శ్రీఎస్. వెంకటరామరెడ్డి అలియాబాద్ గాంధినగర్ కాలనీలో ఆంధ్రప్రదేశ్ పాడి అభివృద్ధి సంస్థ సహాయ క్షీరవిక్రయ పథకాన్ని ప్రారంభించడం, మొదలయిన పెక్కు కార్యక్రమాలు నవంబరు 1 వ ప్రారంభమయాయి. సమైక్యం వర్ధిల్లాలని, వింశత్యంశ ప్రణాళిక తు. చ. తప్పక అమలు కావాలని, శ్రీ వెంగళరావు, ప్రధాని ఇందిరాగాంధి, శ్రీ కొత్త రఘురామయ్య వర్ధిల్లాలని కోటి నినాదాలతో జంటనగరాలలో పెక్కు తోరణాలు కట్టబడ్డాయి.

### దీక్షితార్ ద్విశత జయంతి

కర్నాటక సంగీతావతార పురుషులైన త్రిమూర్తులలో ఒక్కరైన ముత్తుస్వామి దీక్షితార్ కృతుల విషయమై పరిశోధన జరుగాలని, వారికృతులు పూర్తిగా ముద్రితం కావాలని పలువురు వక్తలు నవంబరు 2 వ తేదీన ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ కళాభవన్‌లో ఏర్పాటు చేసిన ముత్తుస్వామి దీక్షితార్ ద్విశత జయంతి సందర్భంలో సూచించారు. సంగీత నాటక అకాడెమీ ఉపాధ్యక్షులు శ్రీ మామిడిపూడి ఆనందం ఈ జయంతికి అధ్యక్షత వహించారు. జవాహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ శ్రీ ఎం. వి. రాజగోపాల్ ముఖ్యాతిథిగా వున్నారు. శ్రీ ఎం. వి. రాజగోపాల్ తమ ప్రసంగంలో "దీక్షితార్ గొప్ప వాగ్గేయకారులు. ఆయన చిదంబరనాథయోగితో కలిసి కాశికి యాత్ర వెళ్లారు. అప్పటినుంచి ఆయన జీవితం గొప్ప మలుపు తిరిగింది. కాశీలో వున్నప్పుడు హిందూస్తానీ సంగీత ప్రభావం ఆయనపై చాల పడింది. దానివల్ల తర్వాత సంగీతానికి ప్రయోజనమే కలిగింది. ఆయన కృతులలో గొప్పదనం ఆలాపన ఆయన 72 మేళకరరాగాలలోను కృతులు రచించారు. ఆయన సకలశాస్త్ర విద్వాంసుడు, సంస్కృతభాషను పుక్కిటపట్టినవాడు గనుక సంస్కృతంలోనే కృతులు రచించారు." అన్నారు. శ్రీ మంచాళ్ల జగన్నాథరావు ప్రసంగిస్తూ, దీక్షితార్ రాగ ప్రస్తారం అసదృశమని, ఆయనకృతులలో ప్రాచీన సంగీతం సంప్రదాయ వైభవం ప్రత్యక్షమవుతుందని అన్నారు. ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీ నూకల చిన సత్యనారాయణ తమ ప్రసంగంలో దీక్షితార్ శైలి మధురిమని, త్యాగరాజ కృతులను త్యాగరాజస్వామి సూచించిన రాగలలో కాక భిన్నరాగాలలో పాడడం సులభంగాని, దీక్షితార్ కృతులు ఆరాగాలలోనే పాడక తప్పదని అన్నారు. తర్వాత శ్రీ నూకల చినసత్యనారాయణ దీక్షితార్ కృతులను గానం చేశారు. ప్రారంభంలో అకాడెమీ కార్యదర్శి శ్రీకె.వి.సుబ్బారావు స్వాగతం చెప్పగా, సంయుక్త కారదర్శి శ్రీ బి. కృష్ణంరాజు చివర ధన్యవాదాలు చెప్పారు.

### గిరిజన అభివృద్ధికి 122 కోట్లు

ఐదవ పంచవర్ష ప్రణాళికలో గిరిజనాభ్యుదయ కార్యక్రమాలకోసం 122 కోట్ల రూపాయల పథకాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సిద్ధపరచిందని సాంఘిక సంక్షేమ శాఖా మంత్రి శ్రీ భాట్టం శ్రీ రామమూర్తి నవంబరు 3 వ తేదీన పత్రికా ప్రతినిధులకు తెలిపారు. ఇంత వరకు దున్నని భూమి కొత్తగా దున్నగానే అపూర్వ ఫలాలిచ్చేట్టు ఇంతవరకు అంతగా ఆర్థిక ప్రయోజనం పొందని గిరిజనులు ఈ పథకాలతో అపూర్వలాభాలు, అభ్యుదయం పొందగలరనడం నిస్సందేహం.

### ఉపశ్రుతి :

"ప్రభుత్వోద్యోగాలు ప్రజాసేవకోసమే అని కొత్తగా నినాదాలు ప్రకటిస్తున్నారే పత్రికలవారు. ఎందుకండీ?" అని ప్రశ్నించాడు. ఒక ప్రభుత్వోద్యోగి నను "సత్యంవద ధర్మంచర అని ముందు ఎవరూ చెప్పలేదా ? ఇప్పుడూ చెబుతున్నారు గదా. అది దేనికోసమో ఇదీ దానికోసమే" అన్నాను.

# మనలో మాట

చిన్న సీరియల్ కథల పోటీలో రూ. 800 లు బహూమతి పొందిన మొదటి కథ 'మైనస్ (బతుకులు' సీరియల్ కథ యీ వారంతో పూర్తి అయింది. రూ. 800 లు బహూమతి పొందిన మరొక సీరియల్ కథ 'రాదారి పడవ' యీ వారం నుంచే ప్రారంభించాము. ఇక 'పరిధి' 'మిణుగురులు' వున్నాయి. వీటి ప్రచురణ కూడా పూర్తి అయిన తర్వాత పాఠకులకు వ్యాస రచన పోటీ –యీ సీరియల్ కథలపై–బ్యాలట్ వుంటాయి కనుక యెప్పటికప్పుడు యీ సీరియల్ కథలు గల సంచికలను వేరే తీసి పెట్టుకోమని మా పాఠకులకు జ్ఞాపకం చేస్తున్నాము.

* * *

గేయాలు పంపేవారు దానితోపాటు తపాలా కార్డు జత చేయడం కార్టూన్లు పంపేవారు స్వంత చిరునామా గల తపాలా బిళ్లలు అతికించిన కవరు పెట్టడం మరిచిపోతే వారికి అవి – పత్రికలో పడతాయో పడవో – త్వరగా తెలిసే అవకాశం వుండదు ... ఈ విషయాలపై ఉత్తర ప్రత్యుత్తరాలకు కూడా వీలుండదని మరోసారి విజ్ఞప్తి.

'విమలా రామం'గారి బ్లాక్ మెయిల్ [14 వ పేజీ] కథ యీ సంచికలో వేశాము ... ఇక్కడ ఆ విషయం ప్రస్తావించటానికి కారణం. ఆ కథ ''బొమ్మ'' మీద చిత్రకారుడు, రచయితల 'పేరు' లో రెండక్షరాలను కలిపి రాయడమేనని వేరే చెప్పనక్కరలేదు ...

* * *

ప్రశ్నావళి, డాక్టర్ సలహాలు, ఉత్తరాలు మొదలగు శీర్షికలకి పంపేవారు కొందరు అన్నీ ఒకే కార్డుమీద వ్రాస్తున్నారు. అట్లాగాక, విడి విడిగా వేర్వేరు కార్డులమీద వ్రాసి పంపటం అవసరం.

# ఫాలాక్షుని డైరీ

## ఆరేళ్ళ బాలుని అద్భుతాలు

మనుష్యులలో భగవదంశలూ, మహత్యాలూ, అద్భుతాలూ వుండడం, వుంటాయనుకోవడం చాలా హాస్యాస్పదమని, అలా వున్నట్టు ఎవరైనాకనక నిరూపిస్తే వారికి తాను లక్షరూపాయలు పారితోషికం యిస్తానని శ్రీలంక హేతువాదాల సంఘ అధ్యక్షుడు డాక్టర్ కోవూర్ వో ఛాలెంజి విసిరారట. మండ్యకు చెందిన పాండవపురంలో వో ఉపాధ్యాయుని ఆరేళ్ళకొడుకు శ్రీ సాయికృష్ణ తలవిూంచి విభూతి, కుంకుమ వస్తాయట. అతని చేతుల్లోనుంచి పళ్ళు, పుష్పులు, వగైరాలూ కూడా వస్తాయట. ఈ విషయం తెలియజేస్తూ డాక్టర్ జి. వెంకటరావు అనే ఆయన డాక్టర్ కోవూర్‌కు రాసి స్వయాన చతేంచుకోడానికి రమ్మని కోవూరుని ఆహ్వానించారట. ఆయన రాని పక్షంలో ప్రతినిధినైనా పంపమని కోరారట. ఒకాయన వచ్చి ఆ కుర్రవాడికి తాము కొన్ని పరీక్షలు పెడ్తామని, వాటిలో నెగ్గితేనే తాము ఒప్పుకుంటామని అన్నారట. తనకి పందాలూ, పగ్గాలూ వద్దని ఆ కుర్రాడన్నాడట. అతను పుట్టపర్తి సత్యసాయిబాబావరంతో పుట్టాడట.

## ఆయువుని పెంచే సంగీతం!

పర్వతారోహణ వల్ల శరీరంలోని రక్తం శుభ్రపడి, తత్ఫలితంగా ఆరోగ్యం పెరిగి జీవిత కాలం పెరుగుతుందట. ఈ రోజులలో యీ ఫలితం కోసం పర్వతాల కోసం పరుగులెత్తడం కష్టం. ఇదే ఫలితం సంగీతం పాడడం వల్ల కూడా జరుగుతుందట. సంగీతంలో అంత మహత్యముందట. కనుక పర్వతాలను ఎక్కలేనివారు, ఎక్కడానికి పర్వతాలు లేనివారూ కనీసం కాస్సేపయినా హాయిగా (?) గొంతెత్తి సంగీతం పాడుతే, దాని వల్ల కలిగే వ్యాయామంతో శరీరమంతా ఉత్తేజం గలిగి, చక్కని ఫలితం వస్తుందని, కనుక కనీసం స్నానాల గదిలోనయినా గొంతెత్తి పాట పాడడం శరీర ఆరోగ్య రీత్యా అవసరమని బ్రిటిష్ ప్రకృతి వైద్యుల సమావేశంలో డేవిస్ అనే ఆయన అన్నారట. హత్తిరీ, అదా కీలకం !

## 54 ఏళ్లకి 28 మంది పిల్లలు

మధ్యఆఫ్రికా జనాధిపతి మార్షల్ జాన్ ఫెడెల్ బరీగస్సా తనకు మొన్న 19 వ తేదీన 28వ సంతానం కలిగినట్టు ప్రకటించారట. (తనకంటే తనకనికాదు) ఆయనకి సంతానంతో కలిపి పదహారు మంది ఆడపిల్లలు, పన్నెండుమంది మగపిల్లలూ నట. ఆయన వయస్సు యాభై నాలుగేళ్ళట.

## చైనానుంచి మొట్టమొదటిసారి భారతదేశం వచ్చిన టీ

కలకత్తాకు చెందిన కల్నల్ కిడ్ అనే ఆయన 1782లో చైనా నుంచి మొట్టమొదటిసారిగా భారతదేశానికి టీ విత్తనాలు తెచ్చి నాటించారట. ఈయన నాటించిన చోటే ఈనాడు విఖ్యాతి గాంచిన కలకత్తా బొటానికల్ గార్డెన్సట!

## సంతానంకోసం యువకుని బలి!

అంబికాపూరుకు చెందిన వో దంపతులకుసంతాన భాగ్యం లేక, ఆ భాగ్యం కోసం ఎన్ని అకార్యాలయినా చేయదలచి, చివరకు నరబలికి కూడా వారు వెనుదీయలేదట. అభయ్‌మాప్‌వార్ అనే వో యువకుణ్ణి విందుకు ఆహ్వానించి, అతను విందారగిస్తుండగా ఫక్రున అతనితల తెగి పడేలా నరికేశారట. ఇది 13వ తేదీన జరిగింది. ఈ కిరాత కార్యంతో చేతులు తడిసిన నలుగురిని పోలీసులు పట్టుకున్నారట. తల యీ నలుగురిలో ఒకాయన పొలంలో దొరికిందట. మొండెం మాత్రం మచ్చాని నదిలో దొరికిందట.

## హరిజన వృద్ధునిపై అత్యాచారం

పోట్లాటలో వచ్చిన ఆవేశంతో అహమ్మద్‌నగర్ శ్రీగొండతాలూకాకు చెందిన బి[illegible] గ్రామంలో కొంతమంది వో అరవై రెండేళ్ళ హరిజనుణ్ణి పట్టుకుని చావబాది, అంతతో ఆగక అతన్ని అడవికి ఈడ్చుకుని వెళ్ళి, అక్కడాతని ఎడమచెయ్యి మణికట్టు దగ్గరకు నరికేశారట. రాష్ట్రమంత్రి బి. సి. [illegible]జాగారు వెళ్ళి ఆ హరిజనుణ్ణి చూశారుట.

## తొక్కిసలాటలో 17 మంది స్త్రీల మరణం

మధురలో వో బట్టల మిల్లుల యజమానులు దీపావళి సందర్భంగా సౌరాష్ట్రకు చెందిన(కులము) పేదవారికి కొత్తబట్టలు మొన్న 26వ తేదీన పంచి పెడుతుండగా శుభ సందర్భంలో 17 మంది ఆడవారు, వో పిల్లాడు తొక్కిసలాటలో చనిపోయారట, [illegible] వో సగి మంది శిథిలస్థితిలో ఆసుపత్రిలో చేర్చబడ్డారట.

దీపావళి చిన్న సీరియల్ కథల పోటీలో ఎన్నికైన కథ

# మైనస్ బతుకులు

మామూలుగా రాత్రి పదింటికి రాధ వెనక దడి సందు చేసుకొని స్కూలు పడమటి తలుపు చప్పుడు చేస్తుంది. వెంటనే మురళి తలుపు తెరిచేస్తాడు. రాధ లోపలి కొస్తుంది.

ఆ రోజు పిల్లలు వెళ్ళటం కాస్త ఆలస్య మైంది. పిల్లలందరూ అతని పక్కనే వున్నప్పుడు తలుపు చప్పుడైంది.

"సరే, వెళ్ళిరండిరా."

పంపించేసి తలుపు తీశాడు. రాధ లోపలి కొచ్చింది. తలుపు గడియ పెట్టి యివతలికి రాగానె ప్రెసిడెంటు జానకిరామయ్యగారు సుడిగాలిలా హాల్లోకి దూసుకువచ్చారు.

చప్పుడు విని చాటుగా దాక్కుంది రాధ.

"ఏమోయ్ కుర్రాళ్ళ చదువులెలా సాగు తున్నై" అని ఆరంభమైన ప్రసంగం ప్రెసిడెంటు కెన్నడీవరకూ వెళ్ళి రాత్రి పన్నెండు గంటలు దాటింది.

ఆయన వెళ్ళడు. లోపల చిక్కుకున్న రాధ బయటికి వెళ్ళలేదు.

ఉక్కిరి బిక్కిరైపోయాడు, మురళి.

"సరే, పోదామా" అనగలిగాడు, చివరికి.

"అలాగే, అలాగే...తలుపులన్నీ వేశావా? లోపల బల్లలూ అవీ వున్నాయి. దొంగ వెధవలు తిరుగుతున్నారు వూళ్ళో..."

బయట తాళం వేయించిగాని కదల్లేదు, జానకి రామయ్య.

ఇద్దరూ కొంత దూరం నడిచి విడిపోయారు.

లోపల చిక్కుకున్న రాధ ఎంత భయపడిపోయిందో, అసలు వుందో తలుపు తెరుచుకొని వెళ్ళిపోయిందో చూడాలని తిరిగివచ్చాడు. తాళంతీసి లోపలికి చూశాడు. రాధ ఇంకా అక్కడే వుంది, చీకట్లో.

భయంతో ఆ పిల్లనోట మాటరావటం లేదు. ఏదో చెప్పబోయి తలుపు చూపించింది.

"నేను పోకుండా బయట ఎవరో గడియ పెట్టారు"

వెళ్ళి చూశాడు......నిజమే.

ఇంతలో వీధిగుమ్మం మూసుకున్న చప్పుడయింది.

మురళి తలుపులు తియ్యబోయాడు. బయట తాళం పడింది.

ఎక్కడున్నారో, ఏమో వంద మందిజనం చుట్టుముట్టేశారు.

(గత సంచిక తరువాయి)

బయట జానకి రామయ్యగారి కంచు కంఠం గంటలా వినిపిస్తోంది.

"సంసారుల ఇళ్ళల్లో ఇలాంటి రంకు వేషాలు వేస్తే మేమంతా వూళ్ళో వుండాలా, ఎక్కడికన్నా పోవాలా... పిలవండయ్యా హరిబాబుగారిని..."

ఎవరో పరిగెత్తారు.

తలపట్టుకొని కూర్చున్నాడు, మురళి.

ఇంత అధోగతిపాలవుతుందని అనుకోలేదు, రాధ.

ఈ భూమి బద్దలైపోతున్నట్లు, ఇద్దరూ లావాలాంటి ప్రవాహంలో చిక్కుకున్నట్లు ఉన్నారు.

"తండ్రీ కూతుళ్ళకి కులం తక్కువ వాళ్ళతో రంకు. ఇదంతా చేయించేది ఆ పెద్ద మనిషే. కూతుర్నిటు పంపించి ఆయన హాయిగా తాగి పడుకుంటాడు."

"రాకెట్ యుగం. అంతా స్పీడు. పూర్వం పిల్ల నెతుక్కుంటూ దాని చుట్టూ గిరికీలు కొట్టేవాళ్ళు కుర్రాళ్ళు. ఇప్పుడు కుర్రాడు వంటరిగా కనిపించాడంటేచాలు, దూసుకొచ్చేస్తున్నారు పిల్లలు. వచ్చే సెంచరీలో బాదరేషన్ ఆఫ్ మారేజన్ వుండవు. ఏరోజు కారోజు చీరకలర్‌నిబట్టి సెలక్టు చేసుకుంటారు కుర్రాళ్ళని" నల్లాచారి రాధకి వినిపించేట్టు లోపలికి అరుస్తున్నాడు.

"ఇంత రంకు నేర్చినదాన్ని ఇంకెవడుచేసుకుంటాడండీ. ఏ సుయ్యో గొయ్యో చూసుకోవాల్సిందే."

ఇంతలో హరిబాబుగారు వచ్చాడు.

"లోపల నిద్రపోతున్న ముండమోపిని లాక్కురండి. ఇక్కడ కొంపలంటుకుని ఏడుస్తుంటే హాయిగా తాగి పడుకున్నాడో లేక దేనికోసం పోయాడో......"

సూరిబాబు కేం అర్థంకాక వచ్చి నిలబడ్డారు.

తాళంతీసి యిద్దర్ని బయటికి లాగారు.

మురళి వొంటిమీద దెబ్బలు పడ్డాయి.

దెబ్బలకన్నా వాడిగా ములుకుల్లాంటి మాటలు రాధగుండెను దూసుకుపోతున్నాయి.

అప్పటికే అపవాదులో తల బొప్పికట్టిన సూరిబాబు వినకుండా వుండేందుకే ప్రయత్నించాడు.

చివరికి మిగిలిపోయింది మురళే.

"లార్డ్ కిష్ణాని మొక్కుకొని, ఒక ఫైన్ మార్నింగ్ ఆ కరుణామయుని కాళ్ళు పట్టుకో. నీమీద కోపం తగ్గుతుంది." వెళ్ళిపోయిన నల్లాచారి తిరిగొచ్చి సలహాయిచ్చాడు. (కరుణామయుడంటే తాత్పర్యం హరిబాబుగారని).

మురళి కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి చేరేసరికి తెల్లవారింది.

అమ్మముందు తలెత్తలేకపోయాడు. ఇంకెవరయినా చెప్పేలోగా తనే చెప్పాలనుకున్నాడు

"తెలిసిందిరా. ఇలా జరుగుతుందని నాకు ముందే తెలుసును."

ఏదో అర్థంకాని, కొత్త ప్రపంచాన్ని చూస్తున్నట్లుంది మురళికి.

*జరిగినకథఇది :* చాలా కాలం క్రితం చనిపోయిన తల్లికి సమాధి కట్టించాలని మళ్ళీ ఆ వూరు వస్తాడు మురళి. ఓ స్త్రీని వెంటాడుతూ తన కళ్లెదుటే దుర్మరణం పాలయిన వ్యక్తి ఆవూరి పెద్ద హరిబాబుగారని గుర్తిస్తాడు మురళి. మురళి పాత జ్ఞాపకాల్లో......కృష్ణ జయంతినాడు విర్జీవులైన మరదలు శ్యామలమ్మను వురితాటికి తగిలిస్తూ, పుట్టి కొడుకున్న మురళి కంటబడ్డ హరిబాబుగారు మురళిచేత తప్పుడు సాక్ష్యం చెప్పిస్తారు. తమ్ముడు సూరిబాబుపై అపవాదువేసి ప్రెసిడెంటు పదవి నుంచి తొలగిస్తాడు హరిబాబు. సూరిబాబుగారి కూతురు రాధ మురళి పరస్పర ఆకర్షితులౌతారు.

ఇదంతా ఒక నాటకం. సూత్రధారి హరిబాబు. తమ్ముడిమీద యింకా కక్ష తీర లేదన్నమాట. మధ్య తమ జీవితంతో ఆడుకున్నారు. పాపం రాధగతి ఏమవుతుందో...

వారం రోజులు బయటికి రాలేదు, మురళి. పిల్లలు స్కూలుకు రావడంలేదు.

తొమ్మిదోరోజు మురళివాళ్ల పాలేరు వెల్లి వారంముందే భయంకరమైన వార్త వినిపించాడు. రాత్రి రాధమ్మ నిప్పంటించుకుని ఆత్మహత్య చేసుకుందట!

అటుపై అంచెలంచెలుగా గ్రామవాణి అమ్మలక్కలు, అయ్యవార్లు ఇక్కడ రియాక్షన్ చూడాలని ఏదో ఒక పని కల్పించుకుని వార్త చాలా వివరంగా ప్రచారం చేస్తున్నారు.

చికాకుల్తో మతిమత మవుతున్న సూరిబాబు కూతుర్ని చడామడా తిట్టాడట. రోషంతో కుతకుతలాడిన రాధమ్మ కాల్చుకు చచ్చింది. ఇది మొదటి వెర్షన్.

ఊళ్లో గోడలనిండ మసిబొగ్గులతో రాధ, మురళి కార్టూన్లలో నింపేరు 'మురళి, రాధ కామ కథ. టిక్కెట్టు పావలా' అని రాధ యింటిముందు బోర్డు పెట్టారట. ఇది రెండో వెర్షన్

ఇక రాధ ఆత్మహత్య కథని గ్రామవాణి ఇలా ప్రచారం చేసింది.

పన్నెండు గంటల ప్రాంతంలో రాధ పెట్రోలు తెచ్చి, దొడ్లో చక్కగా పరుచుకుంది. డబ్బా కిరసనాయిలుతో చక్కగా తడిపేసింది. పెట్టె కూర్చొని చక్కగా చేతులు జోడించి, అగ్గిపుల్ల గీసింది.

ప్రశాంతం చావకుండా సూటిపోటి మాటలతో క్షణక్షణం చస్తుంది సూరిబాబు, మురళి.

ఆవేశంలో అతని మొహం నల్లబడిపోయింది.

ఇప్పుడు లోకం దృష్టిలో రాధమ్మ చావుకు కారణం మురళి ... హంతకుడు ... పాపం ముక్కుపచ్చలారని పిల్లజీవితం నిప్పులపాలు చేశాడు.

తప్పు తనదైతే లేదా కావాలని ఆపిల్లపేదయినా అన్యాయం చేస్తే శిక్ష కోసం చేతులు చాపేవాడు. దోషం తనది కానప్పుడు, అది నలుగురికీ చెప్పుకోలేని స్థితిలో చిక్కుకున్నప్పుడు మానవుడు పడే ఆవేదన అంతా ఇంతా కాదు.

జీవితంలో కష్టాలు ఒంటరిగా రావు.

**పాఠకుల బ్యాలట్ కోసం వేసిన మొదటి సీరియల్**

## వైనస్ బతుకులు

అమ్మ మంచం పట్టింది.

అప్పటికే ఆస్తంతా తన చదువుల కోసం హరిబాబుగారి దగ్గర తాకట్టులో వుంది.

ఒక చల్లని రోజు నలుగురు పెద్దమనుషులతో వచ్చి వెయ్యిరూపాయలు విరాళంలా యిచ్చి వెళ్లాడు హరిబాబు.

అది ఖాతాలో జమ అయింది.

ఎన్ని మందు లిప్పించినా అమ్మ జబ్బు తగ్గలేదు.

ఆరునెలలు సేవ చేశాడు.

చివరికి ఆమె కూడా ఒక అర్ధరాత్రి కన్ను మూసింది.

వూళ్లో జనం ఎవరూ రాలేదు. రానివ్వలేదేమో ...

పిలిచే ధైర్యం తనకి లేదు.

సాయంత్రం వరకూ చూసి, పాలేరు, తను ఇంటివెనకనే చితిపేర్చి దహనక్రియ జరిపించేశారు.

శూన్యంలా మిగిలిపోయాడు మురళి.

పాలేరుచేత చీటీ పంపించాడు, హరిబాబుగారికి.

ఆస్తంతా రాయించుకొని అసలు పోను మిగిలిన ఎనిమిదివందల యాభై రూపాయలు యిచ్చి ఎక్కడయినా పట్నంలో ఉద్యోగం చూసుకోమని చెప్పి పంపించేశాడు.

మళ్ళీ వెనక్కి పిలిచి ఆయన చిన్న రికమండేషన్ లెటర్ కూడా రాసి యిచ్చాడు.

బయటికివచ్చి చించేశాడు, మురళి.

వూరువిడిచి వెళ్ళేముందు రహస్యంగా సూరిబాబుగారి ఇంటికెళ్ళి చేతులు పట్టుకున్నాడు మురళి.

"నీ తప్పేంలేదు మురళి. అంతా నా కర్మ" తల బాదుకుంటూ పసిపిల్లాడిలా తల్లడిల్లిపోయాడు.

మురళి గుండె తరుక్కుపోయింది.

అనంతంలాంటి లోకంలోకి వెతుక్కుంటూ వెళ్ళిపోయాడు.

* * *

ఏదో చప్పుడైతే లేచి కూర్చున్నాడు మురళి. వొళ్లంతా ముచ్చెమటలు.

కాస్సేపటికి కోడికూత గూడా వినిపించింది. మళ్లీ కేశవరావు బయటికి వచ్చి పొమ్మనేలోగా వెళ్లిపోవాలి.

పాపం ఆ పిల్ల ఎవరో... నిజం అందరికీ చెప్పాలి.

అయితే ఎవరికి చెప్పడం ?

ఆ వూళ్లో తన మాటకి విలువలేదు.

తిన్నగా పోలీస్ స్టేషన్‌కి వెళ్లాడు.

అంతా కోలాహలంగా వుంది కాస్త పేరు పలుకుబడి వున్న పెద్ద మనుషులంతా అక్కడే వున్నారు. అది వ్యక్తిగత సమస్య కాదన్న నిర్ణయానికి వచ్చారు.

కలక్టర్ నుంచి ప్యూన్ల వరకూ లిండీ తిప్పులూ లేవు. ఇక పోలీసుశాఖ గురించి వేరే చెప్పనవసరం లేదు పైనుంచి ఫోన్లు, టెలిగ్రాం మెసేజెస్ ప్రవాహంలావస్తున్నాయి.

చివరికి చొరవచేసుకున్నాడు మురళి. తిన్నగా ఇన్‌స్పెక్టర్‌గారి దగ్గిర కెళ్లాడు. తనుచూసిందంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.

"ఎక్కణ్ణుంచి వస్తున్నావ్ ?"

చెప్పాడు.

"ఆవూరెందుకు వెళ్లావ్ ?"

"సూరిబాబుగారిని చూద్దామని."

"ఆయన నీకు చుట్టమా ?"

"కాదు"

"మరెందుకు వెళ్ళావ్ ?"

"చూద్దామని"

"అయితే వూళ్లోకెందుకు వెళ్లలేదు ?"

"ముందు తోటచూద్దామని వెళ్లాను."

"సరిగ్గా టైమూ, ప్లేసూ తెలిసినట్టు, అక్కడికే, మర్డర్ జరుగుతున్న చోటికే వెళ్లావన్నమాట."

"అవును"

"ఇది కుట్రచేసి చేసినహత్య"

"కాదు"

'అని నమ్మించడానికి నిన్ను పంపించారా ?'

"లేదు"

"ఈమర్డర్ వెనక పెద్దముఠా వుంది. దాంతో నీకు సంబంధం వుండాలి."

వారంరోజులు మురళిని రిమాండ్‌లో వుంచారు.

అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పలేక మురళి తల బొప్పికట్టింది.

చివరికి వదిలేశారు, అనుమానిస్తూనే.

ఏమైనాసరే ఆ పిల్ల ప్రాణం కాపాడాలి.

ప్రాణం పోయినా సరే, నెగ్గకు రావాలను కున్నాడు.

చిన్నగా వూళ్లోకొచ్చి మొదట జైల్లో వున్న పిల్ల యింటి కెళ్లాడు. తాళంవేసుంది. అయినవాళ్లకోసం గాలించాడు. ఎవరూ బయటికి రాలేదు.

ఈలోగా మురళికి ఈ మర్డర్‌కూ సంబంధం వుందని వూళ్లో తెలిసిపోయింది.

గుడి దగ్గిరకొచ్చి చేతులెత్తి మొక్కాడు. మండపంలో వున్న జనం అతన్ని చూసి చల్లగా జారుకున్నారు,



పలకరించినా పలకడం లేదు. ఏ ఇంటి కెళ్లినా తలుపులు మూసుకుంటున్నారు. అతన్తో మాట్లాడితే ఏమవుతుందోనని భయం.

స్కూలు దగ్గర పెద్ద పందిరి వేశారు. ఆ ఆవరణలో సాయంత్రం హరిబాబుగారి సంతాప సభ.

మంత్రులు, ఉపమంత్రులు, కాబోయే మంత్రులు వస్తున్నారట. మంచి అవకాశం అనుకున్నాడు.

చుట్టూ చీకటి పడినా ఆ పరిసరాల్లోకి రాకుండా బొమ్మలు విరుచుకొని నిలబడ్డాయి ఖరీదైన లైట్లు: ఖరీదైన కార్లలో, ఖరీదయిన బట్టల్లో వచ్చే వాళ్లకోసం వేదిక చుట్టూ వున్న కుర్చీలు వినయంగా ఎదురు చూస్తున్నాయి. మురళి ఒక మూల చిన్న చోటు చేసుకున్నాడు.

పూలమాలలు, తమాషాలు. తతంగాలు పూర్తిచేసుకొని హరిబాబుగారి ఆత్మశాంతి కోసం రెండు నిమిషాలు మౌనంగా నిలబడ్డారు.

తెచ్చిపెట్టుకున్న నిశ్శబ్దం. అంతా తలలు వంచి నిల్చున్నా ప్రతి ఒక్కడూ ఏం చేస్తున్నాడో గమనిస్తూనే వున్నాడు.

మురళి ఒక్క గంతులో వేదిక మీదకి వెళ్లాడు.

"సోదరులారా! మీ కార్యక్రమానికి అంతరాయం కలిగిస్తున్నందుకు నన్ను క్షమించండి. మీకు తెలియని నిజాన్ని చెప్పాలనే సంకల్పంతో యీ సాహసం చేశాను. ముందు హరిబాబుగారు ఎవరో, ఆయన నిజస్వరూపం ఏమిటో నన్ను చెప్పనివ్వండి..."

చుట్టూ నిశ్శబ్దం. హఠాత్తుగా వచ్చిన యీ పరిణామానికి అందరి మొహాలూ తెల్లబడ్డాయి.

"హరిబాబుగాడు హంతకుడు. ఇప్పుడు కాదు. పదేళ్ల కితం ఒక హత్య చేశాడు. అది నేను కళ్లారా చూశాను. ఇది సత్యం."

"ఈ నిజం చెప్పడానికి పదేళ్లు పట్టిందన్నమాట" మరో మైకు దగ్గరవున్న వక్త నొక్కి వక్కాణించాడు.

జనం గొల్లుమన్నారు. కేకలు. అరుపులు.

"చాలు పొమ్మనండి." వెనక నుంచి వార్నింగ్.

ఆవేశంతో మురళి కంపించిపోతున్నాడు. "నేను చెప్పేది నిజం. నేనేం చూశానో అదే చెబుతున్నాను. ఒక దిక్కులేని ఆడదాన్ని అన్యాయంగా చంపకండి. ఆ పిల్ల హరిబాబు గారిని హత్య చెయ్యలేదు."

"అయితే నువ్వు చేశావా?" రెండో మైకు వ్యక్తి భళ్లున నవ్వాడు.

అందరూ ఆకాశం చిరిగేట్టు నవ్వారు.

"ఎద్దు పొడిచి చంపింది." మురళి గొంతులో జీర వినిపించింది.

"హరిబాబుగారిని చంపింది ఒక ఎద్దు కాదు. నాలుగు ఎద్దులు. ఇది ఆమందలో ఎద్దే. లాగెయ్యండి యీ ఎద్దుగాణ్ణి" అదే వక్త ఆర్డర్ వేశాడు.

ఆబోతుల్లాంటి నలుగురు వచ్చి బరబరా అతన్ని కిందకి లాగేశారు.

జనం మధ్యకి వచ్చేశాడు. అందరూ అతన్ని వెనక్కి నెట్టేస్తున్నారు. ఛాన్సు దొరికినవాళ్లు కొట్టేస్తున్నారు ఎవరికీ అతని మాటలు వినిపించడం లేదు "ఆరోజు ప్రాభవం, పలుకుబడి వున్న వాడికోసం అబద్ధం చెబితే నలుగురూ నమ్మారు. ఇప్పుడు దిక్కులేని ఒక ఆడదానికోసం నిజం చెబితే ఎవరూ నమ్మటం లేదు."

తన శక్తినంతా కూడగట్టుకొని మళ్లీ స్టేజి మీదికి వచ్చాడు.

అతని చొక్కా చిరిగిపోయింది. జుట్టు మొహాన్ని కప్పేసింది.

"నేను చెప్పేది నిజం. నామాట నమ్మండి ఎంతో నుంగిని ఏన్నో విధాల వంపిన హంత కుడికి మీరెన్ని వందన సభలు పెట్టినా వాడి అవ్వు కండలేదు."

వల్లీ లెల్ని కిందికి లాగ ఒకక పొడిచే వాడు. ఒళ్లంతా హూనా అయిపోయింది.

రక్తం చిమ్మింది! చిరిగిన చొక్కా రక్తంలో తడిసిపోయింది! ఒళ్లంతా రక్తం!

ఆవేశంలో ఇంకా చెప్తూనే యూను మురళి.

ఎవరు లెక్కచేయకుండా ఒ స్పృహంది ఇక

హరిహరాదులు అడ్డొచ్చినా అతన్ని ఆపలేరు.

ఒక్క అంగలో మళ్ళీ స్టేజ్ మీదికొచ్చి మైక్‌స్టాండ్ గిరగిరా తిప్పాడు. "ఎవరైనా నా దగ్గరికొస్తే చంపేస్తాను ... ..."

ఉన్మాదిలా చుట్టూ చూశాడు. అందరూ ఆగిపోయారు. ఇప్పుడతని మొహంనిండా రక్తం! రక్తమే మనిషి రూపంలో నిలబడి నట్లుంది! ఆ రక్తమే మాట్లాడుతున్నట్లు అతనిగొంతు మైకులో వినిపించింది! "మై డియర్ ఫ్రెండ్స్, ఫోస్ ఎండ్ ఎనిమీస్. నేనొక నిజాన్ని యిప్పుడే తెలుసుకున్నాను. ఇక మీ కార్యక్రమానికి అడ్డురాను. నాకు ఒక్కనిమిషం మాట్లాడేఅవకాశంయివ్వండి."

"తెలిస్తే చెప్పు. వెధవ గొడవ." అరుపులు, కేకలు,

రోషంతో మురళి రొమ్ము ఉబికింది. గాఢంగా నిశ్వసించాడు. దిక్కులదిరేట్టు వికటంగా నవ్వాడు: "ప్లస్ అంటే ధనం, మైనస్ అంటే రుణం. ప్లస్ ఇంటు మైనస్ అంటే ప్లస్ అనే గొప్పవాడికి ప్రతికూలంగా

## మైనస్ బతుకులు

ఏం చెప్పినా యీజ్ యీక్వల్ టు మైనస్. అంటే ఎవరూ నమ్మరు. అలాగే మైనస్ ఇంటు ప్లస్ యీజ్ యీక్వల్ టు మైనస్ ఆల్సో"

మురళి కళ్లనుంచి, నోటినుంచి రక్తం చిమ్ముతుంది.

మైనస్ అనే పేదవాడికి అనుకూలంగా మాట్లాడినా ఎవరూ నమ్మరు. ఇక ప్లస్ ఇంటు ప్లస్ యీజ్ ప్లస్. గొప్పవాడికి అనుకూలంగా మాట్లాడే ప్రతి మాటా అందరూ హర్షిస్తారు. మళ్లీ మైనస్ ఇంటు మైనస్ కూడా ప్లస్సే. పేదవాడికి ప్రతికూలంగా మాట్లాడు, అందరూ నమ్మేస్తారు........"

ఉప్పెనలా ఒకసారి ముందుకు తూలాడు. నిప్పులు కక్కుతున్నట్లు మళ్ళీ గర్జించాడు. "ఇది నిజం. నలుగురూ నమ్మేదే నిజం... నిజానికి ఇజాలు రెండు, రంగులు రెండు, రూపాలు రెండు......"

అతని కాళ్లు పట్టు తప్పిపోతున్నాయి. నరాలు కుప్పలా కూలిపోతున్నాయి.

"లూనటిక్... పిచ్చోడు... సెండ్ హిమ్ టు మెంటల్ హాస్పిటల్... పిచ్చాసుపత్రిలో వేయండి..." వెనకనుంచి కేకలు అర్డర్లు.

"నో......" ముందుకు వస్తున్న పోలీసులు అతని గొంతువిని ఆగిపోయారు. "నో ... ... మై డియర్ మెంటల్ పేషంట్స్ సావధానంగా వినండి నిజానికి, వాస్తవానికి దూరంగా బ్రతికే మీరంతా మెంటల్ పేషంట్స్. అబద్ధం తెర మధ్య ఆడే నాటకం ఇది. కాబట్టి మీరు నమ్మేదే నిజం, మీకు నచ్చిందే నిజం..."

కిందికి వొరిగిపోతుండగా పోలీసులు అతన్ని గడ్డిపరకలా లాక్కెళ్లి పోయారు..

అయినా అతను అరుస్తూనే వున్నాడు.

అతని మాటలు ఇప్పుడూ వింటున్నారు జనం... ఇంకా వింటారు...

[అయిపోయింది]



# ఉపదేశం — ఉపదేష్ట — ధర్మపథం

మనకు మతవిషయాన్ని గాని మరొక విషయాన్నిగాని ఉపదేశించిన గురువు దేవునితో సమానుడని అంటారు. 'ఆచార్య దేవోభవ' అనే వేద వాక్యా, 'గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః' అనే ఆర్యవాక్యమూ చెప్పతూ ఉన్నవి.

అందువల్ల శిష్యుడు గురువును దేవునితో సమానంగా చూచుకోవలసి ఉన్నది. అయినా అతడు మానవమాత్రుడే కాని దేవత కాదు కాబట్టి మనుష్యులకు సహజములైన అవగుణాలు కొన్ని ఉండడంలో ఆశ్చర్యం లేదు స్వార్థపరత, పదార్థాల యెడ లోలత్వం, అసహిష్ణుత మొదలైన గుణాలు గురువులో ఉండవచ్చు అట్టి గుణాలు గురువుగారికి ఉన్నాయని తెలిసినా, శిష్యుడు వాటిని విమర్శించడం తగదు తనకు కావలసినది విద్య. తాను గురువు నాశ్రయించింది కూడా అందుకోసమె. దానిని గ్రహిస్తే చాలు. గురువు ప్రవర్తనను విమర్శించి, అతని యెడల అగౌరవాన్ని చూపడం ఉచితం కానే కాదు

ఒకప్పుడు శ్రీ రామకృష్ణ పరమహంస వద్దకు ఒక యువకుడువచ్చి, ప్రసంగవశమున తన గురువుగారినిగూర్చి తెలుపుచు, ఆయనలోని బలహీనతలను వెల్లడించుచు, విమర్శింపదొడగెను. అట్టి ఉపదేష్టల వలన లోకమునకు మేలుకంటె కీడే ఎక్కువ కలుగునని తన అభిప్రాయమును వెల్లడించెను.

ఆ మాటలు విని పరమహంస చిరునవ్వు నవ్వుచు ఇట్లనెను — 'నాయనా! నీవు పొరపడుచున్నావు. నీవు విద్యకోసం ఆయనను ఆశ్రయించావు గాని, ఆయన స్వరూప స్వభావాదులచే ఆకర్షింపబడి కాదు. ఆయన గుణాలతో నీకు ప్రసక్తి లేదు. విద్య లభిస్తే చాలును. చూడు, మనకు మంచి ముత్యం కావాలనుకో. అది ముత్యపుచిప్పలో మూయబడి ఉంటుంది. సాధనాలతో ఆ ముత్యపు చిప్పను తెరచి, అందులోని ముత్యాన్ని మనం తీసుకుంటాం. తర్వాత ముత్యపు చిప్పను పారవేస్తాం. దాని సంగతినే పట్టించుకొనం. అది పలచగా ఉందో, దళసరిగా ఉందో, అందంగా ఉందో, అసహ్యంగా ఉందో మనకు అక్కర్లేదు. దాని మంచిచెడ్డలను విమర్శించడం అనవసరం. అది మన తెలివి తక్కువనే సూచిస్తుంది''

ఆ మాటలను విని ఆ యువకుడు తన పొరపాటును గ్రహించి తల వంచుకున్నాడు.

మహా మునులలోకూడా అవగుణాలు ఉండవచ్చును. వారు చెప్పినట్లే చేయాలి కాని, వారు చేసినట్లు మనం చెయ్యరాదని 'మునివన్నాచరితవ్యః; మునివాక్యం తు కర్తవ్యమ్' అనే ఆర్యోక్తియే తెలియచేస్తూ ఉన్నది.

—బులుసు వేంకటరమణయ్య



## ఎన్నికదావాపై అప్పీలులో శ్రీమతి ఇందిరాగాంధీ విజయం: సుప్రీంకోర్టుతీర్పు

1971 మధ్యంతర ఎన్నికలలో రాయ్‌బెరెల్లీ నుంచి జరిగిన లోక్‌సభ ఎన్నికల్లో శ్రీమతి ఇందిరా గాంధీ గెలుపు చెల్లదంటూ అలహాబాద్ హైకోర్టు జూన్ 12న ఇచ్చిన తీర్పును రద్దుచేస్తూ, శ్రీమతిగాంధీ ఎన్నికచెల్లుతుందని ధ్రువపరుస్తూ నవంబర్ 7న సుప్రీంకోర్టు తీర్పు యిచ్చింది. సుప్రీంకోర్టు రాజ్యాంగ ధర్మాసనంలో ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎ. ఎన్. రే సహా అయిదుగురు న్యాయమూర్తులు విడివిడిగా యిచ్చిన తీర్పులో ప్రధానమంత్రి ఎన్నికను ధ్రువపరిచారు.

# వారఫలం

మహేష్

**28-11-1975 శుక్రవారం మొదలు 4-12-1975 గురువారం వరకు**

**మేషం :—** వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. పోటీవారితో వాద ప్రతివాదాలు తగవు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**వృషభం :—** సాహసికవ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:—** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపారంలో దాయం బాగుంటుంది. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం:—** అనుకూలమైన వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ముమ్మందు లాభించని వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు— బంధుమిత్రులను కలుసుకొంటారు. విలాస వస్తువులు కొంటారు.

**సింహం :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన సమాచారం అందగలదు.

**కన్య :—** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయాణాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపారముతో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**తుల :—** ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం

## రాలిన ముత్యాలు

.......శ్రీ సోమసుందర్.......

వర్తమానానికొక దుర్లక్షణముంది -
అనుక్షణం గతంలో కలిసిపోతూ
ఉంటుంది;
భవిష్యత్తుకు మరో లక్షణముంది -
అనవరతం ముందుకే జరుగుతూ
ఉంటుంది.

మధ్యలో ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం —** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు.

**ధనుస్సు:—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రాగలదు. ఆరోగ్యం బాగుంటుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**మకరం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. స్త్రీలకు— విలాస వస్తువులు కొంటారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కుంభం:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. అనుకూలమైన వార్తలను వింటారు. మీకంటె పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :—** ఇతరులతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు బాగుంటాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

# ఎన్నో హెయిర్ డైలు, జుట్టును పైపైనే డై చేస్తాయి కనుక, త్వరగా వెలిసిపోతాయి... కానీ

# ట్రూ-టోన్

## మాత్రమే, ప్రతి వెంట్రుకలోకీ చొచ్చుకొనిపోయి, జుట్టును శాశ్వతంగా డై చేయడమే కాక...జుట్టుకు సహజమైన ఆ రూపాన్ని యిస్తుంది.

ట్రూ-టోన్...దానిలోని ప్రత్యేకమైన సూత్రీకరణ వలన, వెంట్రుకలోని క్యూటికల్‌లను ఛేదించి కార్టెక్స్‌లోకంటా చొచ్చుకొని పోతుంది.
ఫలితంగా, ఈ డైను జుట్టు త్వరగా గ్రహించుకుంటుంది...
మరోమాటలో చెప్పాలంటే ఈ డై, జుట్టు యొక్క రూపాన్ని శాశ్వతంగా సహజంగా ఉండేలా తీర్చిదిద్దుతుంది.
ట్రూ-టోన్, జుట్టుకు సంబంధించిన రసాయన శాస్త్రం బాగా తెలిసిన హెలిన్ కర్టిస్ వారు సృష్టించినది.






లిక్విడ్

### వీటిలో దేన్నయినా ఎన్నుకోండి:
### ట్రూ-టోన్ లిక్విడ్ హెయిర్ డై మరియు బొట్లుగా కారని ట్రూ-టోన్ జెల్.

ఈ రెండు మీ జుట్టును మృదువుగా, నిగనిగలాడేలా కావలసిన తీరులో లొంగేలా తీర్చిదిద్దగలిగే హెయిర్ కండిషనర్‌తో కూడినవి.




జెల్

మీ జుట్టును మొదటి సారిగా డై చేద్దామనుకుంటున్నారా?
ఉచితంగా లభ్యమయే ఒక చిన్న పుస్తకం,
"హెయిర్ డైయింగ్ ఎక్స్‌ప్లెయిన్డ్", కోసం
ఈ చిరునామాకు వ్రాయండి:
జె.కె. హెలిన్ కర్టిస్ లిమిటెడ్, జె.కె. బిల్డింగ్, బొంబాయి-400 038

**నలుపు మరియు గోధుమ రంగులలో లభ్యమవుతుంది. మగవారి కోసం ప్రత్యేకమైన ప్యాక్.**

ఏదో పుస్తకం చదువుకుంటున్న ఇందిర తలుపుచప్పుడయ్యేసరికి ఉలిక్కి పడింది. ఊపిరి బిగపట్టి ఓ క్షణం అలాగే కూర్చుండిపోయింది. మళ్ళీ అదే చప్పుడు ... పరిచితమైన ఆ ధ్వని గుండెలదాకా పాకివచ్చి ఒళ్ళంతా వణికించింది.

ఈమాటు పిలుపుకూడాను. "ఇందూ!" వచ్చాడు. తన పాలిట యముడు వచ్చాడు. తన ప్రాణాలు హరించటానికి వచ్చాడు ... ఆమె గజ గజలాడింది.

"తలుపు తియ్యి ఇందూ!... ఇలా ఎంత సేపు బయట నుంచోపెడతావ్!"

అవును. అతడలా అరుస్తూ వుంటే ఎప్పుడో రాబోయే ప్రమాదం ఇప్పుడే ముంచుకు వస్తుంది... గబుక్కున తలుపు గడియ తీసింది ఇందిర.

చిరునవ్వు చిందిస్తూ లోపలికి దూసుకు వచ్చాడు ప్రభాకరం. తలుపులు దగ్గరగా వేస్తూ, "గడియ వెయ్యనా! లేక ఇలాగే ఉంచనా ?" అన్నాడు.

"నన్ను చంపి పారెయ్యటానికి ఎలాగయితేనేం? నీ యిష్టం వచ్చినట్లు కానీ..."

"ష్! అరవకు. అనవసరంగా ఇద్దరం బెదిరిపడతాం. సరే, ఏదయినామంచిది..."



ప్రభాకరం తలుపువేసి వచ్చాడు.

"ఇందూ!..." అంటూ ఆమె చేయి పట్టుకున్నాడతను. ఆమె చటుక్కున చెయ్యి వెనక్కి లాక్కుంది. ఆ మరుక్షణమే అతని చెంప ఛెళ్ళుమంది.

"ఇందూ అట. ఇందూ. రోజు రోజుకీ నీ దౌర్జన్యం మితిమీరి పోతోంది. ఇన్నాళ్ళూ డబ్బంటూ పీక్కుతిన్నావ్. ఇప్పుడు చెయ్యి పట్టుకునేదాకా వచ్చావ్. నన్నిలా చిత్రవధ చేయకపోతే ఒక్కసారి చంపి పారేసి పోకూడదా!" అంటూ చేతులతో ముఖాన్ని కప్పుకుంది ఇందిర.

ప్రభాకరం చెంప తడుముకున్నాడు. గలగల నవ్వుతూ ఆమె చెయ్యి మళ్ళీపట్టుకున్నాడు. "నా లెంప వాయగొడితే కొట్టావు కాని.. నీ చెయ్యెంత కందిపోయిందో చూడు ఇందూ! గాజు చిట్లింది. చేతికి గాయం చేసింది. పాపం, ఆయన చూస్తే ఎంత బాధ పడతారు!"

చేయి విదిలించి కొట్టింది ఇందిర. "ఛీ! దుర్మార్గుడా! నువ్వింత విషసర్పానివని అనాడే తెల్సుకోలేకపోయాను. క్రితం వారం రాకపోతే నన్ను విడిచిపెట్టావనుకున్నా. కాని నన్ను సర్వనాశనం చేయటానికే మళ్ళీ వచ్చావు... నన్ను కాక మరెవర్ని పెళ్ళాడినా ఆయనకి సుఖసంతోషాలు మిగిలుండేవి. పరువు మర్యాదలూ దక్కేవి. ఈ భ్రష్టురాలిమూలంగా ఆయన జీవితంకూడ కళంకమయిపోయింది" అంటూ ఏడువసాగింది.

"ఇప్పుడేమయిందని? నేనెవరి పరువు మర్యాదలు తీసేయటం లేదే! మన రహస్యం మనమధ్యనే వుంది. మరో మనిషికి తెలియదు. నువ్వయినా ఎందుకింత బాధపడాలి? నిన్నెప్పుడయినా ముట్టుకోనిచ్చావా? నీ అయన కన్యాయం చేస్తున్నానని నువ్వేం కుమిలిపోనక్కరలేదు, నేనేం ప్రేమభిక్ష పెట్టమని నిన్నడగడంలేదు, ఎటొచ్చీ. ఆ వుత్తరాలు... అవే నీ ప్రేమలేఖలు నాదగ్గరుండిపోయాయి" అంటూ ప్యాంటు జేబులోంచి ఓ వుత్తరాల కట్ట పైకి తీశాడతను. అక్కడ వాలుకుర్చీలో ఆసీనుడవుతూ మళ్ళీ అన్నాడు. "...ఆనాడు... అదే కార్తీక పౌర్ణమికిముందు రోజు నాకో వుత్తరం వ్రాశావు గుర్తుందా!.. పోనీచదివి వినిపిస్తా, అప్పటి తియ్యటి ఊహలు.. మధురమయిన కోర్కెలు మళ్ళీ గుర్తుచేస్తా... ఆయన కెప్పుడయినా చెప్పి ఖుషి చేయచ్చు కూడాను..." అంటూ నవ్వాడు.

"ప్రభాకరం! ప్రభాకరం!..." ఆమె కన్నీళ్లతో చేతులు జోడించింది.

"ఛ! ఎంతయినా మాజీ ప్రియుణ్ణి కదా! కనీసం ప్రభా... అన్న నీ తియ్యని పిలుపు కయినా నోచుకోలేదా ఇందూ!"

ఆమె గబగబా లోపలికి పరిగెత్తింది. మరు నిమిషంలో పళ్లు కోసుకునే చాకు తీసుకువచ్చింది. జుట్టురేగి, బొట్టు చెరిగి, కన్నీళ్లలో శోకమూర్తిలా ఉన్న ఇందిరచేతిలో ఆచాకు తళుక్కున మెరిసేసరికి ప్రభాకరం కంగారుపడ్డాడు. పైకి లేవబోయాడు.

ఇందిర అరిచింది "ఆగు. లేవకు."

అతడు వెలతెలబోతూ కుర్చీ కతుక్కుపోయాడు.

"నిన్ను చంపుతానని భయపడుతున్నావా? అంతశక్తి నాకులేదు. అంత ధైర్యమూలేదు. అవే ఉంటే నేనింత నరకం అనుభవించేదాన్ని కాను. ప్రతిసారివచ్చి నన్నిలా చిత్రవధ చేస్తున్నావో నీకు తెలియదు నాకింక ఈ బాధ పడే ఓపిక లేదు నాకు పిచ్చెక్కిపోతోంది. ఏ క్షణం ఏం చేస్తున్నానో నాకే తెలియటం లేదు ఏదో రోజున నువ్వెలాగా ఆయనకంతా చెప్పేస్తావ్! అప్పుడు నాకెలాగూ చావు తప్పదు. ఆపనేదో ఇప్పుడేచేసి పుణ్యంకట్టుకో!. ఒక్కవేటుతో నాతల నరికి ఈ భూమికి భారం తగ్గించు" అంటూ ఆచాకు అతని ఒడిలో పడేసింది ఆమె.

"ఛ! నేను కిరాతకుణ్ణి కాదు ఇందూ! మనుష్యుల్ని చంపడానికి నేనేమన్నా రాక్షసుణ్ణా? ఏదో అవసరంవచ్చి ఇలా వచ్చాను కాని... నిన్నేమన్నా రోజూ పీడిస్తున్నానా? ఏమంత అడుగుతున్నాను... ఒక్క పాతిక. వారానికో పాతిక రూపాయలు ఇవ్వటం నీకేమంత కష్టం! నేనంటే నిరుద్యోగినికాని ఆయనకేం చక్కని ఉద్యోగం ఉంది. అదంతా పోనీ... ఈసారొక్క వీభయ్యిచ్చి నన్ను పంపెయ్యి. ఇదే ఆఖరిసారి. ఇంకెప్పుడూ రాను."

"ఏభయ్యేంకర్మ. నెలఖర్చులకోసం పెట్టుకున్న డబ్బంతా ఆ బీరువాలో కేష్ బాక్సులో ఉంది. అదంతా పట్టుకువెళ్ళు... ఇంకీ అబద్ధాల బతుకు బతకలేను. ఆయనకింక కల్పించి ఖర్చులు చెప్పలేను. అనుక్షణం ఆయన్ని మోసంచేస్తూ నే నెందుకు బ్రతకాలి? ఆయన నా మీదుంచిన విశ్వాసాన్ని నే నెందుకు కూలదొయ్యాలి! ఇదే ఆఖరుసారంటూ మళ్లీ నువ్వు రావన్న నమ్మకం లేదు. నిజంగానే దీన్ని ఆఖరుసారి చెయ్యి. అదిగో ఆ పెట్టెలో నా నక్లెసు, గాజులు జత ఉన్నాయి. ఇదిగో చెవులవి ఉన్నాయి. మెళ్లో నాన్నాడుంది మంగళసూత్రం ఉంది. తర్వాత నా ఒంటి మీంచి తీసుకోవటం నీకేమంత కష్టంకాదు. నేనే తీసేద్దును కాని ఆయన కాయుక్షణం కల్గించే ఆ పాపం చేయలేను...ఊఁ కానియ్! ఒక్క క్షణం కళ్ళు మూసుకుంటాను. ప్రాణం పోతున్నా నోరు విప్పను. ఒకే ఒక్క వేటు ... నీ కోరిక తీరుతుంది. నాకీ బాధా తప్పుతుంది. నీకు చేతకాకపోతే చెప్పు. నేనే పొడుచుకుంటాను. నీ మీదకి కేసు కూడా రాదు. ఎవరో దొంగలీ పని చేసారనుకుంటారు ఆత్మహత్య అంటే మహాపాతకం అని కాదు నా భయం. నే నింత ఘోరం చేస్తే అది ఆయనకి చెడ్డపేరు. నలుగురూ నానా మాటలతో ఆయన్ని హింసిస్తారు, ఆ పాపం కూడ నేను మూటకట్టుకోలేను. బతికుండగా ఆయనకెలాగా సుఖాన్నివ్వలేకపోతున్నాను. చచ్చి పోయా



కయినా...'' ఆమె మాటలు పూర్తికాలేదు.

తలుపులమీద చప్పుడయింది. ఇందిర కొయ్యబారిపోయింది. ప్రభాకరం తేలకళ్ళు వేసాడు.

మళ్ళీ చప్పుడయింది. ఈ మాటు పిలుపు కూడను. "ఇందూ!"

ఇందిర ప్రాణంలేని బొమ్మలా అక్కడే నిలబడిపోయింది.

ఆ వచ్చినదెవరో గుర్తించటానికి ప్రభాకరని కాస్సేపు పట్టలేదు. ఏదో భయంతో గజగజ లాడి పోయాడు.

"తలుపు తియ్యి ఇందూ! ఏమిటి ఆలశ్యం?"

ఇందిరవైపు చూసాడు ప్రభాకరం. ఆమెలో చలనంలేదు. ఆ ఉత్తరాలకట్ట గబగబా పేంటు జేబులో దోపుకున్నాడు. ఎలాగో ధైర్యం కూడ దీసుకొని తలుపులు తీసాడు. బయట నిలబడిన ఆ భారీ మనిషిని తప్పించుకుంటూ బయటకు పారిపోబోయాడు.

"ఆగు,బదర్!" అంటూ అతని చెయ్యి పట్టుకున్నాడు రవీంద్ర.

"నాకు పనుందండి నేను వెళ్ళాలి." అని చేతులు గింజుకోబోయాడు ప్రభాకరం.

రవీంద్ర ముఖం కందగడ్డలా ఉంది. "ఇంతసేపు లేని తొందర ఇప్పుడేమొచ్చింది ప్రభా! ఒక్కసారి లోపలికిరా. నా ఆతిథ్యం స్వీకరించివెళ్ళు."

రవీంద్ర పట్టు విడిపించుకోవటం అతనికి సాధ్యం కాలేదు. ఈ మాటలతో పై ప్రాణాలు పైనే పోయాయి.

"ష్! అనవసరంగా బయట గొడవ చెయ్యకు. లోపలికి పద." అంటూ అతన్ని దాదాపు లోపలికి లాక్కువచ్చాడు రవీంద్ర. పడక్కుర్చీలో కుదేసాడు. వెంటనే వెళ్లి తలుపులు వేసివచ్చాడు.

రెండోచేతిలోని పేకెట్ టేబిల్ మీద పెడుతూ. "ఇందూ! ప్లేటేదయినా తీసుకురా!" అన్నాడు. అతని గొంతులో కోపంలేదు. కాఠిన్యంలేదు. విసురులేదు. వ్యంగ్యంలేదు. ఏ భావమూలేదు చాల 'కాజుయల్'గా ఉంది. ప్రశాంతంగా ఉంది.

ఇందిర కదల్లేదు. గుడ్లప్పగించి అలానే నిలబడిపోయింది. ముఖం పాలిపోయివుంది. గజగజ వణికిపోతోంది. ఆధారంలేక మరుక్షణం నేలకూలే బొమ్మలా ఉంది.

మెఱుపులా వెళ్ళి ఆమెను పట్టుకున్నాడు

# బ్లాక్ మెయిల్

రవీంద్ర. 'ఠప్'మన్న శబ్దం వినిపించి ప్రభాకరం ఉలిక్కిపడ్డాడు. ఇందిర చెంప ఛెళ్ళుమంది. ఒక వెర్రికేక పెట్టింది. మరుక్షణంలోనే స్పృహతప్పిపోయిందామెకు

"చూడు బ్రదర్! కొంచెం ఆ వంటింట్లోకి వెళ్ళి గ్లాసెడు నీళ్ళు తెస్తావా?" అన్నాడు రవీంద్ర ఆమెను పొదివి పట్టుకుంటూ. ప్రభాకరం నీళ్ళు తీసుకువచ్చే లోపల ఆమెను రెండు చేతులతో ఎత్తుకువెళ్ళి పక్కనున్న సోఫాలో పడుకోపెట్టాడు. నీళ్ళందుకొని ఆమె ముఖంమీద చిలకరించాడు. మరో నిమిషానికి ఆమెకు తెలివి వచ్చింది

కళ్ళు తెరచి ఇద్దర్నీ చూసింది. పెదవులు కంపించాయి ఒళ్ళంతా ఏదో భయంతో వణికిపోయింది మరుక్షణం గట్లు తెంచుకొని పొంగిపొరలే చెఱువుల్లా ఉన్నాయి ఆమె కళ్ళు.

## వెలుగు నీడలు

వెలుగులో
నా నీడతో నేను పోట్లాడాను
నా చైతన్యం అలిసిపోయి
నే నోడిపోయాను
వెలుగులోంచి చీకటిలోకి నడిచాను
నీడని జయించానని
గర్విస్తున్నాను!

— అద్దేపల్లి రామమోహనరావు

"పూర్ గరల్!..." అంటూ ఆమె చేయి పట్టుకొని నొక్కివదిలేసాడు రవీంద్ర. వెంటనే టేబిల్ మీది ఫ్లాస్కులోని కాఫీ గ్లాసులోపోసి తెచ్చాడు. "తాగు...కాసేపట్లో అంతా సర్దుకుంటుంది." అన్నాడు.

ఇందిర తల త్రిప్పుకుంది. పక్కకు తిరిగి చేతుల్లో ముఖాన్ని దాచుకుంది. గట్లుతెగాయి. వరద ముంచుకొచ్చింది. ఆమెని ముంచెత్తివేసింది.

"చూడు బ్రదర్! ఇందిర ఏడుస్తోందని బాధపడకు. ఏడవనీ! కాసేపటికి గుండెల్లో బరువంతా తగ్గిపోతుంది. అందాకా మనిద్దరం కాసేపు కబుర్లు చెప్పుకుందాం! ఏమంటావ్?" అని నవ్వాడు రవీంద్ర.

ప్రభాకరం బిక్కచచ్చిపోయాడు. నోట మాటరాక కొయ్యబారిపోయాడు.

"నువ్విలా వస్తావని నాకు ముందేతెల్సు. అందుకనే ఈ స్వీట్సు తెచ్చాను. నిజం. నీ కోసమే! ఓ స్వీటుతిని వెచ్చని కాఫీ త్రాగు. బుర్ర చురుగ్గా పనిచేస్తుంది." అంటూ స్వీటుప్లేటు, కాఫీగ్లాసు అతనిముందు పెట్టాడు రవీంద్ర.

"ఇప్పుడొద్దండి..." అన్నాడు ప్రభాకరం ఎలాగో గొంతు పెగల్చుకొని.

"డోన్ట్ వర్రీ! కాఫీ నేను చేసిందికాదు. ఇందూచేసిందే!"

చటుక్కున కాఫీగ్లాసు అందుకొని తల దించుకున్నాడు ప్రభాకరం.

"ఇలా కూర్చో! నీతో నాల్గు కబుర్లు చెప్పాలని ఉంది." అంటూ అతనిచేయి పట్టుకొని వాలుకుర్చీలో కూర్చోపెట్టాడు తను కూడ కాఫీగ్లాసు పట్టుకొని దగ్గరగా కుర్చీ లాక్కున్నాడు.

ప్రభాకరం దించిన తల ఎత్తలేదు. అతని ముఖం కందగడ్డలా ఉంది. ఎంతో భారాన్ని భరిస్తున్నవాడిలా ఉన్నాడు. వేడి వేడి కాఫీ నాలుక చుర్రుమంటున్నా లెక్కచెయకుండ గబగబ త్రాగేశాడు.

"గుడ్!...మీ ఇద్దరిగురించీ మాట్లాడదామనుకున్నా...కాని, ఇందూ ఇంకా వినటానికి సిద్ధంగాలేదు. పోనీ, కాలక్షేపానికి నీకో చిన్న కథ చెప్తా...వింటావా!"

"వినను. వింటానికి నాకు తీరికలేదు." అంటూ లేవబోయాడు ప్రభాకరం

అతన్నొక్క త్రోపులో కుర్చీలో కూలేశాడు రవీంద్ర "చూడు బదర్! నీతో మాట్లాడులూ కూర్చోటానికి నాకూ తీరిక లేదు. కాని నా సరదాకోసం నేను కథ చెప్పటం లేదు నీకు పనికివస్తుందని చెపుతున్నాను. నిన్ను గమ్యం చేరుస్తుందని చెప్తున్నాను."

ప్రభాకరం ముఖం పాలిపోయింది. పిచ్చి పట్టినవాడిలా ఓక్షణం అతనివైపుచూశాడు. అవయవాలపట్టు విడిపోయినట్లు కుర్చీలో అలాగే కూలబడి పోయాడు

"నాక్లాసుమేటు రాజీ, నేనూ ప్రేమించుకున్నాం..."

ప్రభాకరం చటుక్కున తల ఎత్తాడు. రవీంద్ర ముఖంమీద చిరునవ్వు చూసి మళ్ళీ దించుకున్నాడు.

"వయస్సులోఉన్న వాళ్ళిద్దరు ప్రేమించుకోవటం తప్పంటావా?"

ప్రభాకరం మాట్లాడలేదు.

"సరే. నిన్నిక ప్రశ్నలతో వేధించను.

తిన్నగా జరిన కథ చెప్పేస్తాను... అది తప్పో ఒప్పో మాకు తెలియదు. మేమిద్దరం గాఢంగా ప్రేమించుకున్నాం. పెళ్లి చేసుకోవాలనుకున్నాం. ఎల్లకాలం కల్సి వుండాలనుకున్నాం. ఎన్నో బాసలు చేసుకున్నాం, మరెన్నో కలలు కన్నాం. అవన్నీ కథలుగా మా ప్రేమలేఖల్లో రాసుకున్నాం. ఆమె రాసిన ఒక్కో ప్రేమలేఖ ఎన్ని వందలసార్లు చదివేవాడినో నాకే లెక్క తెలియదు. అటువంటి మా ప్రేమని చిన్నాభిన్నంచేస్తూ విధి మా ఇద్దర్నీ విడదీసింది... వాళ్ల పెద్దవాళ్లు మా పెళ్లి కొప్పుకోలేదు. నిరుద్యోగినని చెప్పి నా రాజీని నాకు కాకుండా చేశారు. నేనప్పటికి నిరుద్యోగినే! ఎల్లకాలం ఉద్యోగం లేకుండా అలాగే వుండిపోతానా? ఇంత చదువు చదివి ఏదో నాటికి నా భార్యని




పోషించుకునే ఉద్యోగమే సంపాదించలేక పోతానా?... ఇన్ని వివరంగా చెప్పాను. కష్టపడి కూలిపని చేసయినాసరే నా రాజీని పోషించుకుంటా నన్నాను. ఆమెకి పెట్టాకనే ఆపూట నేను తింటానన్నాను. మా ప్రేమను సఫలం చేసుకునే అవకాశం ఇమ్మని ఎంతో ప్రాధేయపడ్డాను. ప్చ్! వాళ్ళు నా ప్రార్థన ఆలకించలేదు. నన్ను కాలదన్ని ఓ గొప్ప సంబంధం తెచ్చి ఆమెకి పెళ్లి చేసారు. పెద్దవాళ్లని ఎదిరించలేక పోయిందో - నామీద మనసు విరిగిపోయిందో— మరినాకుతెలియదు. రాజీ పెళ్లి చేసుకుని అత్తారింటికి వెళ్లిపోయింది.''

రవీంద్ర ఓక్షణం ఆగి ప్రభాకరం వైపు చూసాడు. ప్రభాకరం తలెత్తి అతని కళ్లనిండా

ఆనాలో శోధిస్తున్నాయనిపించి చటుక్కున మళ్లీ దించుకున్నాడు.

సిగరెట్టు ముట్టించి గట్టిగా పొగపీల్చి వదలి ''హేవిట్ బ్రదర్!'' అన్నాడు పేకెట్ అతని కందిస్తూ.

''నో థేంక్స్!''

''గుడ్! ఇంక మిగిలిన కథకూడా చెప్పేస్తాను విను... వెళ్లిపోయిన రాజీని తిరిగి ఎలాగూ దక్కించుకోలేను. కాని, యింట్లో పెళ్లి కావల్సిన చెల్లెలుంది. చదువుకునే తమ్ముళ్లిద్దరున్నారు. వీళ్లందర్నీ పైకితీసుకు రావల్సిన బాధ్యతుంది. దానికోసమయినా ఏదో ఒక ఉద్యోగం చేయాలికదా! పడరాని పాట్లు పడ్డాను. అడ్డమయినవాళ్లనీ పట్టుకు ప్రేలాడాను. అయినా దారి కనిపించలేదు. ఆఖరికి అప్లికేషన్ పెట్టటానిక్కూడా డబ్బులేని పరిస్థితి వచ్చిపడింది. ఓసారి చిల్లల డబ్బుల కోసం పెట్టె తీస్తే ఓ ఉత రాల కట్ట బయట ప డి ం ది...... అదేమిటో కాదు రాజీ నా గుండెల్లో తేనె లొలికించిన ప్రేమ లేఖల దొంతర ... తిరిగి నా మనస్సు రాజీ ఊహలతో నిండిపోయింది. మళ్ళీ ఆ ఉత్తరాలన్నీ చదివాను. అంత తియ్యని ప్రేమలేఖలు వ్రాసిన రాజీ నన్ను పూర్తిగా మర్చిపోయిందంటే ఎలా నమ్మటం? ఇప్పుడు నాగురించి ఏమనుకుంటూంటుంది! ఒక్కసారి ఆమెను చూస్తే ? ...''

''ప్లీజ్! ఇంక చెప్పకండి.'' అన్నాడు ప్రభాకరం తన తలపట్టుకుంటూ.

''అదేమిటి బ్రదర్! నా ప్రేమకథ చెప్తుంటుంటే నీకంత వెగటుగా ఉందా? ఈ మాత్రానికే ఇంత ఇదవుతున్నావే! ఆ తర్వాత నేను చేసిన ఘోరం వింటే ఇంక భరించగలవా ? ''

''అందుకనే చెప్పకండి ఇంకేం చెప్పకండి.''

''నీ కోసం కాదు...నాకోసం చెప్తుంటున్నాను. నేను చేసిన ఘోరం నా నోటితోనే చెప్పుకుంటున్నాను. ఇందూ లాంటి ఆడది తన భర్త ఇలాంటి పాపాని కొడిగట్టాడంటే క్షమించదు. కాని, నీలాంటివాడయినా అర్థం చేసుకుంటే నాకు కొంత మ న శ్శాం తి దక్కుతుంది. అందుకనే బ్రదర్! నీ కిదంతా చెప్పుకుంటున్నాను.'' అని ఆగాడు రవీంద్ర.

ప్రభాకరం మాట్లాడలేదు.

''...వెళ్లాను. రాజీని కల్సుకున్నాను. రాజీ ఆనాటి రాజీకాదు. పూర్తిగా మారిపోయింది. నన్ను ఎరుగనట్లే మాట్లాడింది. తనకు గత జీవితంతో సంబంధం లేనట్టు మాట్లాడింది. ఆమె మాటలు వినేసరికి నా ప్రాణాలు గిలగిల లాడాయి. రాజీ దూరమయిందని ఉ క్రో ష ం ఒ క మూ ల ... ఇ ప్ప డు ఇలా మారిపోయిందని కోపం ఇంకోమూల. నన్ను రాచి రంపాన పెట్టాయి. ఒక్కసారిగా ఏదో ప్రతీకార జ్వాల నాలో పెల్లుబికింది. నాకిలా చేసినందుకు రాజీకి శాస్తి చేయాలనిపించింది. ఆ ప్రేమలేఖల కట్ట నా దగ్గరే ఉందని చెప్పాను. అది ఆమె భర్తకి చూపిస్తానని హేళన చేసాను. ఇంకా ఏదేదో అన్నాను. ఆమె ఏడ్చింది. ప్రాధేయపడింది. ఆ కట్ట ఇచ్చేయమంది. నేనేం చెయ్యమంటే అది చేస్తానంది. నా కప్పుడు నా దౌర్భాగ్యపు పరిస్థితి గుర్తుకు వచ్చింది. కొంత డబ్బిమ్మన్నాను. రాజీ అడిగిన వెంటనే డబ్బిచ్చింది. ఉత్తరాలిమ్మంది. తేలేదని అబద్ధమాడను. తర్వాత తెచ్చిస్తానన్నాను ఆ డబ్బు తీసుకొని వెళ్లిపోయాను. కష్టపడకుండా చేతుల్లోకొక్కసారి డబ్బు వచ్చింది దానికితోడు అవసరాలూ నా కలాంటివే ! అందుకనే ''

''ప్లీజ్ ! ఇంకేం చెప్పకండి. నన్నింక చిత్రవధ చేయకండి.'' అన్నాడు ప్రభాకరం. అతని కళ్లల్లో నీళ్లు చిప్పిలాయి.

''పూర్ చాప్! ఆడదానిలా ఏంటావని... తుడుచుకో!'' అంటూ టవల్ అతని ఒళ్లో పడవేసాడు రవీంద్ర.

ఓ క్షణం ఆగి మళ్లీ ప్రారంభించాడు రవీంద్ర. ''నేను చేసిన ఘోరం అంతేననుకుంటున్నావా? ఇంకావుంది పూర్తిగా విను. అప్పుడు నే నెంత 'డేంజరస్ ఫెలో' నో నీకే తెలుస్తుంది ... ఎన్ని అబద్ధాలు చెప్పిందో, ఏ పాట్లు పడిందో నాకు తెలియదు. ఎన్నిమొత్తుకున్నా మా ఏ మాటికి నా బెదిరింపులకి లొంగిపోయి ఇచ్చిచ్చేది. అవసరాలను — డబ్బాశను-ఏమయితేనేం నే నామెను పీడించటం మొదలుపెట్టాను. నా లేఖలు ఆమె భర్తకి చూపిస్తానని, ఆమె బ్రతుకు పాడు చేస్తానని ఎప్పుడూ అనుకోలేదు. అది చూపిస్తే నా కొ చ్చే దే ము ం ది? అని నా దగ్గరున్నంత కాలమే నా ఆటలు సాగేది. ఈ ర హ స్యం అ లా

(32వ పేజీ చూడండి)

# స్టేన్స్‌టైర్

# సమస్యలను పరిష్కరిస్తుంది



స్టేన్స్ టైర్ రీట్రెడ్‌లు సురక్షితమైనవి. ప్రఖ్యాతిగాంచిన టైర్‌సోర్స్ సాంకేతిక పరిజ్ఞానాన్ని స్టేన్స్‌టైర్ వినియోగించుకుంటుంది. మీ టైరు ఎక్కువకాలం పనిచేసేటట్టు గ్యారంటీ ఇస్తుంది.

స్టేన్స్ టైర్ ఎక్కువ ఆదాచేస్తుంది. ప్రతి కేసింగ్‌కు ఎక్కువ రీట్రెడ్‌లు చేయవచ్చు— కాగా లాభకరమైన అంశం. ప్రతి కిలోమీటరును లెక్కకడితే ఖర్చు అతితక్కువ కాగలదు. ముఖ్యమైన కేంద్రాలలో వున్న స్టేన్స్ టైర్ ఫ్యాక్టరీలు వెంటనే సేవచేయడంలో గణతి కెక్కినవి.

**STANESTYRE**

**స్టేన్స్‌టైర్**

**అండ్ రబ్బర్ ప్రాడక్ట్స్ లిమిటెడ్**
తిరుచీ రోడ్, కోయంబత్తూరు

ఫ్యాక్టరీలుగల ఇతర కేంద్రాలు : మద్రాసు. వెల్లూరు. తిరుచి. సేలం. మదురై. ట్యుటికోరన్. బెంగుళూరు. మంగుళూరు. విజయవాడ. సికింద్రాబాద్. ఎర్నాకుళం. కొట్టాయం. కాలికట్. తిరుచూరు.

MAC (B) ST-1/75

## ★ సినిమా విశేషాలు ★

### శ్రీనివాస్ క్రొత్త ప్రయత్నం

''యమలోకపు గూఢచారి'' చిత్రాన్ని డైరెక్ట్ చేసిన పసుపులేటి శ్రీనివాస్ ప్రస్తుతం ''బొమ్మలాట'' అనే చిత్ర నిర్మాణం ప్రారంభించారు. నవంబరులో సెట్స్‌కు వెళ్లే ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం, నిర్మాణం బాధ్యతలను శ్రీనివాస్ చేపట్టారు.

అక్టోబర్ ఆఖరివారంలో అనసూయాదేవి సంగీత సారధ్యంలో శ్రీమతి వేదవతి, శ్రీ బాలమురళీకృష్ణ, కుమారి సావిత్రి పఠించిన శ్లోకాలతో శ్రీకారం చుట్టుకొంది పై చిత్రం.

శ్రీరాం, మదన్, ఆష మున్నగు నూతన తారలు నటిస్తున్న ఈ చిత్రానికి మోహన్ ఛాయ, వీరప్ప కూర్పు సమకూరుస్తున్నారు.

### ఎలుగుబంట్లతో జయసుధ సరసం

విఠలాచార్యగారి ''కోటలో పాగా'' చిత్రంలో ఎన్నో వింతలు ... విడ్డూరాలు కనిపిస్తాయి. ప్రేక్షకులను మైమరిపించే ఘట్టాలతోబాటు, మోసంచేసే మహాత్మ్యం ఆయన జానపద చిత్రంలో వుంటుందనెడి నమ్మకాన్ని వమ్ముచేసే మనస్తత్వం ఆయనకు లేదు

వీర, శృంగార, హాస్యరసభరితమైన ''కోటలో పాగా'' చిత్రంలో రామకృష్ణ, జయసుధ, రాజబాబు, జయమాలిని, సుదర్శనమ్, రాజనాల, సుశీల, కేశవరావుగార్లు ఆయా రసాలకు ప్రాతినిధ్యం వహించారు.

ఎలుగుబంట్లతో జయసుధ సరససల్లాపం ఈ చిత్రంలోని ప్రత్యేకత. ఎన్నో గమ్మత్తయిన మలుపులతో చిత్ర విచిత్రంగా రూపం అందుకున్న ''కోటలో పాగా'' చిత్రం జానపదాలలో వినూత్న సృష్టి అని ప్రేక్షకులు అంటారు.

### మా యిద్దరి కథ

''కథానాయకుడు'' చిత్రాన్ని నిర్మించిన గోపాలకృష్ణ తలపెట్టిన వర్ణ చిత్రమే ''మా యిద్దరి కథ.''

విభిన్న మనస్తత్వాలు, దృక్పధాలు వున్న అన్నదమ్ముల సంఘర్షణ సారమే ఈ చక్కటి కథ.

ఈ చక్కటి కథకు చక్కటి కథాగమనం చాలా అవసరం. సినిమా అనుసరణలో అసాధ్యుడు అనదగిన నందమూరి రమేష్ యీ చిత్రానికి దర్శకుడు గావడం ముదావహం.



''ఇద్దరూ ఇద్దరే''లో

### శ్రీరామరక్ష

నమ్ముకున్నవారికి న్యాయాన్ని చేకూర్చే మంచి మనసు నందమూరిగారికి దేవుడు యిచ్చిన వరం.

దెబ్బతిన్న గోపాలకృష్ణకు, ''నటరత్న''గారి ఆశీర్వాదం లభించడం ఎంతేని ఆనందదాయకం.

''సొగ్గాడు''లో జయచిత్ర, సుధాలు



చంద్రకళ, శోభన్‌బాబు





"మనుషులంతా ఒక్కటే"లో ఎన్. టి. ఆర్., సత్యనారాయణ

### అలిగితివా సఖీ ! ప్రియా !

అంటూ ఈశ్వరరావు స్నేహితురాలింటికి వెళ్ళొచ్చిన తన భార్య అలకపాన్పు పట్టగానే ఆనాడు శ్రీకృష్ణపరమాత్ముడు సత్యభామాదేవిని ఎలా ఊరడించడానికి ప్రయత్నించాడో అలా బుజ్జగించడానికి ప్రయత్నించసాగాడు కానీ కృష్ణపరమాత్ముడు అష్టభార్యలకు యిష్టసఖుడైతే, ఈశ్వరరావు ఏకపత్నీవ్రతుడు. కట్టుకున్న పెళ్ళాన్ని సుఖపెట్టాలన్నదే అతని ధ్యేయం కానీ భార్య జయలక్ష్మి మాత్రం సత్యభామకు ఏమాత్రం తీసిపోదు. సందేహ ప్రాణి. సత్యభామకుమల్లె అంత కోపిష్టి కాకపోవచ్చు కానీ, భర్తను ఎంక్వయిరీ చేయడంలో ఎమర్జంట్. భర్త వారంరోజుల తర్వాత యింటికొస్తే, కుశలాలు అడగట మటుంచి, అలకపాన్పు చేరింది జయలక్ష్మి. ఉండబట్టలేక ఈశ్వరరావు 'జయా ! ఏమిటలా వున్నావు ? నీ ఫ్రెండ్ ఇంటికి వెళ్ళావు. బావున్నారా ?' అంటూ మామూలుగా అడిగాడు ఈశ్వరరావు. 'బాగుండాలన్నా వుండనిస్తారా మీ మగాళ్ళు ? అయినా మగవాళ్ళను అని ఏముందిలెండి. అసలు ఆడవాళ్ళకదూ వాళ్ళను పాడుచేసేది. బిడియాన్ని మరచి, మగవాళ్ళతో ఎక్కడపడితే అక్కడ తిరగడం, ప్రేమపాశంలో పడడం, ఇవన్నీ తలచుకుంటేనే భీదరేస్తుంది' అనే ధోరణిలో పలుకుతుంది జయలక్ష్మి. 'అది సరే ఇంతకూ ఆడది మీదపడితే మీరూరుకుంటారా ?'' అంది జయ. 'నేనయితేనా సిగ్గు నేర్పి మరీ పంపుతాను. అందుకేగా నేను పరాయి ఆడదాన్ని పాములా చూస్తాను' అంటూ బదులిచ్చాడు ఈశ్వరరావు.

సహజంగా భార్యాభర్తల మధ్య జరిగే సంభాషణల్లో ఒకటిగా స్ఫురించే పై చర్చ శ్రీ లక్ష్మీ నరసింహా ఫిలింస్ వారి "స్వర్గం — నరకం" చిత్రంలోనిది. దాసరి నారాయణరావు కథ, మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించిన ఈ చిత్రానికి రామతారకం సమర్పకుడైతే మావుళ్ళయ్య, పి.యస్. భాస్కరరావు నిర్మాతలు. దిడ్డి శ్రీహరిరావు నిర్వహణలో తయారైన ఈ చిత్రం తారకరామ ద్వారా విడుదలౌతుంది.





"బ్రతుకే ఒక పండుగ"లో భవానీ, సత్యప్రియ

### రావుకు శుక్రదశ !

"ముత్యాల ముగ్గు" చిత్రం రావుగోపాలరావు నట జీవితంలో మరపురాని మలుపును తెచ్చిపెట్టింది. దాంతోపాటు విడుదలయిన "జేబు దొంగ" చిత్రం రావుకు సింపతీని ఆర్జించిపెట్టింది. వైవిధ్యం వున్న రెండు క్లిష్టమైన పాత్రలను ప్రతిభావంతంగా పోషించిన గోపాలరావుకు రోజుకొక కొత్త చిత్రం వస్తున్నది నిజమే అయినా, ఆయన చిత్రాలను పరిమితం చేసుకునే పద్ధతిని అవలంబిస్తున్నారు.

ఇప్పుడాయన అంగీకరించిన చిత్రాలలో "భక్త కన్నప్ప" చిత్రంలోని పూజారి పాత్ర, విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వారి చిత్రంలోని పాత్ర ప్రేక్షకుల ప్రశంసలను అందుకునే అర్హతను పొందివున్నాయి.

త్రివేణి పేరాజుగారి "బంగారు మనిషి", అంజలీ పిక్చర్స్ వారి "క్షేత్రయ్య", నళినిశ్రీ కంబైన్స్ వారి చిత్రం, పాంచజన్య ప్రొడక్షన్స్ వారి "పెద్దన్నయ్య" చిత్రాలలో రావు ధరిస్తున్న పాత్రలలో వెరైటీ లేకపోలేదు.

## క్షేత్రయ్య

ఆంజలీ పిక్చర్ కంబైన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న "మహాకవి క్షేత్రయ్య" చిత్రాన్ని కొనడానికి పోటాపోటీగా ఉబలాటపడుతున్నారు. ఏ తెలుగు చిత్రానికి యింతవరకు రాని ఫ్యాన్సీ ప్రైస్ "క్షేత్రయ్య"కు వచ్చింది.

"నటసామ్రాట్" నవరసభరితమయిన నటన కోసం వేయి కళ్ళతో లక్షలాది ప్రేక్షకులు ఉవ్విళ్ళూరుతున్న నిజానికి అనుగుణంగా క్షేత్రయ్య చిత్రానికి కని విని ఎరుగని రేటును యివ్వడానికి ముందు ఉరుకుతున్న వ్యాపారస్తులు ఒకరా ... యిద్దరా, లెక్కపెట్టడానికి.

రోజూ వస్తున్న వందలాది వుత్తరాలు ఎలా వున్నాయో, నిర్మాత ఆదినారాయణరావు వివరించినప్పుడు, ప్రేక్షకులు అక్కినేని పట్ల ఎంతటి గాఢానురాగబద్ధులై వున్నారో తెలుసుకున్నాను.

"మహాకవి క్షేత్రయ్య" చిత్రానికి మొదటి హీరో నాగేశ్వరరావు అయితే, రెండవ ... మూడవ హీరో స్థానం ఆదినారాయణరావు...స్వామిగార్లకు చెందుతుంది.

## టీమ్ స్పిరిట్

"క్షేత్రయ్య" చిత్రాన్ని చూసిన ప్రతి ప్రేక్షకుడు "టీమ్ స్పిరిట్"ను అభినందించకమానడు.

పాత్రధారులగు మంజుల, అంజలీదేవి, జయసుధ, ప్రభ, రాజబాబు, రాధాకుమారి, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, కాంతారావు, కృష్ణకుమారి, గిరిబాబు, వాణి, హేమలత, సాక్షిరంగారావు, ధూళిపాళగార్లు తమ పాత్రలకు పూర్తి న్యాయం చేస్తున్నారు.

సంగీతం పట్ల ఆదినారాయణరావు తీసుకున్న శ్రద్ధాసక్తులను శ్రోతలు ఆస్వాదించి ఆశీర్వదించగలరు.



# సినిమా

దర్శకుడు పి. ఎన్. రావ్‌కు ఖ్యాతిని ఆర్జించే యోగ్యత క్షేత్రయ్యకు వున్నది.

తారకరామ పంపిణీ సంస్థకు పేరుతోబాటు పుష్కలంగా ధనాన్ని తెచ్చిపెడుతుందీ చిత్రం.

## అక్కినేని అంగీకరించిన చిత్రాలు

"క్షేత్రయ్య"తో తెర జీవితాన్ని ప్రారంభిస్తున్న అక్కినేని మున్ముందు బిజీగావుండే పథకాన్ని నిర్ణయించారు.

ఒకవంక స్టూడియో నిర్మాణ కార్యక్రమం, వేరొకవంక షూటింగుల్లో పాల్గొనడం.

అక్కినేనిగారు అన్న మాటలనుబట్టి, ఆయన పోలుకు అయిదు చిత్రాల్లో పని చెయ్యడం అనివార్యము అనిపించింది.

1976 లో సెక్రటరి, బంగారు బొమ్మలు, ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్, మహాత్ముడు, అన్నపూర్ణా పిక్చర్స్, ఎస్. ఎస్. రెడ్డిగారిది, ప్రారంభం అవుతాయి.

ఇవిగాక ముత్యాలముగ్గు నిర్మాతలకు, గొల్లభామ కృష్ణవేణికి అక్కినేని అంగీకరించారు.

## బ్రతుకే ఒక పండుగ

దాదాపు 12 లక్షల వ్యయంతో, భారీ సెట్టింగులతో "బ్రతుకే ఒక పండుగ" వర్ణ చిత్రాన్ని నిర్మించిన నిర్మాతలు వై. క్రిష్టఫర్, పి. హనుమంతరావులు అభినందనీయులు. చిత్రంలోని కీలకమైన పాత్రలకు ఆనంద్, రాధిక, సత్యప్రియ, భవానీ లాంటి నూతన తారలను ఎన్నుకోవడం వారి సాహసానికి మరో సంకేతం. కె. వి. మహదేవన్ (సంగీతం), సత్యానంద్ (మాటలు), ఆత్రేయ (పాటలు), లక్ష్మణ్‌గోరే (ఛాయ), వెంకటరావు (కళ), కోటగిరి గోపాలరావు (కూర్పు) మున్నగు అనుభవజ్ఞులు, ప్రజ్ఞాశాలురు అయిన సాంకేతిక శాఖాధిపతుల నియమించుకోవడం వారి భారీ మనస్సుకు నిదర్శనం. "మీనా" లాంటి ఉత్తమ చిత్రాన్ని నిర్మించిన పి. వి. రమణయ్య సమర్పణలో తయారవడం మరో విశేషాంశం.

పి. సి. రెడ్డి దర్శకత్వంలో ముచ్చటగా ముస్తాబైన ఈ చిత్రంలో క్రొత్తవాళ్ల నటన 'ఎ' వన్ అంటున్నారు చిత్రం చూచినవారు. పాతవాళ్లు లేరు అనే ప్రసక్తి రాకుండా, చిత్రంలోని ముఖ్య పాత్రలను అల్లురామలింగయ్య, సూర్యకాంతం, చంద్రమోహన్, శ్రీధర్, కె. వి. చలం, రమాప్రభ, నిర్మల పోషించారు

ఆత్రేయ పాటలు ఒకప్రక్క, మహదేవన్ బాణీలు మరొకప్రక్క చేరి చిత్రాన్ని మరింత రంజింప చేసాయనడం అతిశయోక్తి కాదు. ఈ చిత్రాన్ని నవంబర్ మాసాంతంలో విడుదల చేయాలనుకుంటున్నారు నిర్మాతలు క్రిష్టఫర్, హనుమంతరావు, సమర్పకుడు రమణయ్యలు.

"ఆడవాళ్లు—అపనిందలు"లో సుధీర్, కాంతం



"కోటలో పాగా"లో

## విదేశాలలో అక్కినేని చిత్రం

గత ఏడు ప్రారంభంలో రాసిన వార్త పాఠకులకు గుర్తుంటుందనుకుంటాను. "నటసామ్రాట్" నాగేశ్వరరావు నటించే "బంగారు బొమ్మలు" వర్ణచిత్రం షూటింగు విదేశాల్లో జరుగుతుంది అని ప్రేక్షకులకు తెలిపాను.

జగపతి రాజేంద్రప్రసాద్‌గారి ఆశయం ఫలించే రోజు రానే వచ్చింది. వచ్చే సంవత్సరం "బంగారు బొమ్మలు" వర్ణ చిత్రం షూటింగు పారిస్‌లో జరగడం తథ్యము అనిపించే విధంగా, అక్కినేనిగారి సంభాషణం తెలియచేసింది.

చిత్ర చిత్రానికి ప్రత్యేకతను ప్రదర్శించే బలం జగపతి అధినేతకు వుంది గాబట్టే, ఆయన అందించే చిత్రాలు అందరినీ ఆకర్షిస్తున్నాయి.

## గోపాలకృష్ణ – రామకృష్ణ

"లక్ష్మణరేఖ" చిత్రాన్ని జనప్రియంగా రూపొందించిన గోపాలకృష్ణను, "తెలుగు ఫిలిమ్" సంపాదకుడు రామచంద్రన్ పిలిచి, తమిళంలో బాగా ఆడిన "ఉరవుచొల్ల వొరువన్" యొక్క తెలుగు బాధ్యతను అప్పగించారు.

గ్యారంటీ స్టార్‌గా పేరు గడిస్తున్న రామకృష్ణ కథానాయకుడుగా నటిస్తున్న ఫిల్మాలయ కంబైన్స్ వారి చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని, సముద్రాల రచనను, కందస్వామి కూర్పును, ఆర్. ఎన్. ప్రసాద్ ఛాయను నిర్వహించగలరని దర్శకుడు గోపాలకృష్ణ చెప్పారు.

## సమాజం మారాలి

గోపాలకృష్ణకు దర్శకత్వం యిచ్చి "సమాజం మారాలి" అనెడి అభ్యుదయ చిత్రాన్ని వరంగల్ బాబుపేట్ తలపెట్టారు. ఈ చిత్రానికి బొల్లిముంత రచయిత.



రాజబాబు, సుశీల

### ఎన్నెన్నో జన్మల బంధం నీదీ - నాదీ

హాస్యరాజు రాజబాబు ప్రభను ప్రేమించాడు. ఆవిడను గూర్చి ఎన్నో ఆశలు పెంచుకున్నాడు. ఏవేవో గాలిమేడలు కట్టాడు కానీ ప్రభ మాత్రం రాజబాబు ప్రేమకు తన సమ్మతిని తెలియచేయలేదు ఈ విషయంగా తికమక పడుతున్న రాజబాబును రమాప్రభ వెంబడించింది. ''నాథా—నాథా'' అంటూ అతని గది కెళ్లి గోల పెట్టింది. అసలే సందిగ్ధంలో వున్న రాజబాబు ఈ హఠాత్ సంఘటనకు విస్తుపోయాడు. ఎవరు నీ నాథుడు? అంటూ రమాప్రభను ప్రశ్నిస్తాడు. అదేమిటి? అలా అడుగుతారు? మీరే నా నాథుడు. మనిద్దరి బంధం ఈ నాటిది కాదు 'ఎన్నెన్నో జన్మల బంధం నీదీ నాదీ' అనే ధోరణిలో మాట్లాడుతూ రాజబాబు పాదాలచెంత చేరింది రమాప్రభ. ఇంతలో కట్ అన్నారు దర్శకుడు లక్ష్మీదీపక్. ఈహాస్యసన్నివేశం రమాప్రభ సమర్పించు కరుణచిత్రవారి 'వింతఇల్లు—సంతగోల'చిత్రంలోనిది

కె కమలాకరరావు, ఆనంద్‌లు నిర్మిస్తున్న ఈ చిత్రానికి బి శంకర్ సంగీతాన్ని, అప్పలాచార్య మాటలను, దేవరాజ్ ఛాయను, తోట కళను, ఆదుర్తి హరనాథ్ కూర్పును, వెంకన్నబాబు ప్రొడక్షన్ను నిర్వహిస్తున్నారు.

సత్యనారాయణ, కాంతారావు, శరత్‌బాబు, చంద్రమోహన్, జయమాలిని, జ్యోతిలక్ష్మి, రాధాకుమారి, ముఖ్య పాత్రలను పోషిస్తున్న ఈ చిత్రం నవంబర్‌లో జరిగే షెడ్యూలుతో పూర్తి అవుతుంది. దయానంద్ నిర్వహణలో తయారవుతున్న ఈ చిత్రం తారకరామా, శ్రీ తారకరామా, నవభారత్‌ల ద్వారా విడుదలౌతుంది.

### మృగాలమధ్య దేవుడున్నాడు జాగ్రత్త

మురళీకృష్ణా మూవీస్ పతాకం క్రింద యం. కె. రాధ నిర్మిస్తున్న ''దేవుడున్నాడు జాగ్రత్త'' చిత్రం సహజమైన అడవుల్లో, వన్య మృగాల మధ్య షూటింగ్ పూర్తి చేసుకుంటూంది. కె. ఎస్ ఆర్. దాస్ దర్శకత్వంలో పూర్తి అవుట్‌డోర్‌లో నిర్మింపబడుతున్న ఈ చిత్రంలో రంగనాథ్, సుచిత్ర, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, నాగేష్, గిరిబాబు, కాంతారావు, భీమరాజు, కె. కె. శర్మ, సత్తిబాబు,దేవిక, జయమాలిని, ముఖ్య పాత్రధారులు.

ఆరుద్ర మాటలు, పాటలు, రమేష్‌నాయుడు సంగీతం, ఎస్. ఎస్. లాల్ కెమెరా, వి. రంగారావు కళను సమకూర్చిన ఈ చిత్రం ఇప్పటికే 12 రీళ్ళు పూర్తి అయింది.



''నిజం నిద్దరపోదు''లో రామకృష్ణ, మమత

### సంగీతం భాగ్యలక్ష్మి

సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో శివప్రసాద్ మూవీస్‌వారి ''భాగ్యలక్ష్మి'' చిత్రం త్వరితంగా తయారౌతోంది. జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి నిర్మిస్తున్న ఈ చిత్రంలో ఫామిలీ సెంటిమెంట్ ప్రధాన పాత్ర వహిస్తుంది. జగ్గయ్య, రంగనాథ్, శుభ, చంద్రకళ, గుమ్మడి, అల్లు రామలింగయ్య, కె. వి. చలం, మరియు నూతన నటుడు విజయప్రకాష్ ముఖ్య పాత్రలను పోషిస్తున్న ఈ చిత్రానికి పి. నాగేశ్వరరావు కథ, బి. ఎల్. ఎన్. ఆచార్య సంభాషణలు, యస్. రాజేశ్వరరావు సంగీతం, సుఖదేవ్ ఛాయ, వాసు కూర్పు, సమకూరుస్తున్నారు. జి. సాంబశివరావు, బి. నారాయణమూర్తి ఈ చిత్రానికి సహనిర్మాతలు.

### పది కేంద్రాలలో శతదినోత్సవం

సమత ఆర్ట్సు వారి ''జేబుదొంగ'' వర్ణచిత్రం పది కేంద్రాలలో శతదినోత్సవాన్ని చవిచూచింది.

హైద్రాబాద్ సంగమ్ థియేటర్లో ''జేబుదొంగ'' శతదినోత్సవ సభ ఏర్పాటైంది. అమాత్య శేఖరులు పిడతల రంగారెడ్డి అధ్యక్షత వహించ, ''నటరత్న'' బహుమతీప్రదానం చెయ్యడం సంభవించింది.

మాస్ అప్పీలువున్న చిత్రానికి విజయం తథ్యము అని ''జేబుదొంగ'' నిరూపించింది. ఇట్టి జనరంజకమైన చిత్రాన్ని నిర్మించిన యాచేంద్ర — చటర్జీ గార్లు, దర్శకుడు మధుసూదనరావు అభినందనీయులు. హీ—మాన్‌కు ''జేబుదొంగ'' మరింత స్టార్ వేల్యూను ఆర్జించిపెట్టింది

### జూదగాడు

సమత ఆర్ట్సు వారి తరువాతి చిత్రానికి యిడిన పేరు ''జూదగాడు.'' ''జూదగాడు'' పాత్రను శోభన్ పోషించగలరని, విక్టరీ మధుసూదనరావు దర్శకత్వం చేపట్టగలరని కథకుడు చటర్జీ చెప్పారు. ఈ చిత్రానికి వెంకటరత్నం ఛాయను, చక్రవర్తి సంగీతాన్ని నిర్వహిస్తారు.

### చక్రవర్తికి అయిదు విజయాలు

ప్రజల్లో పలుకుబడి వున్న ఒకరిద్దరిలో చక్రవర్తి ఒకరు. ఈయన సంగీతం సమకూర్చిన అయిదు చిత్రాలు వందరోజులు ప్రదర్శింపబడిన నిజాన్ని ఎవరూ కాదనలేరు.

(ఎవరికివారే యమునాతీరే, అన్నదమ్ముల అనుబంధం, బలిపీఠం, బాబు, జేబుదొంగ.)

వర్తు వున్న చక్రవర్తిని, నేడు పరిశ్రమ, ప్రజలు ఆకాంక్షిస్తున్నారు.

— శ్రీనివాస్

సమయం రాత్రి పది కావస్తూంది. టేబుల్ లైటు వెలుగులో దీక్షగా రాసుకుంటున్నాడు సుబ్బారావు. టేబుల్‌కు నాలుగు మూరల దూరంలో వున్న మంచం మీద అలవోకగా వొరిగి పడుకున్న ప్రసూన, అతని వైపు అంతకన్నా దీక్షగా చూస్తూంది. సుబ్బారావు చేస్తున్న కాగితాల చప్పుడు, పక్కగా పారుతున్న కృష్ణ గలగల తప్ప అంతా ప్రశాంతంగా వుంది.




చలికాలం. కిటికీలన్నీ మూసేసివున్నాయి. అయినా కృష్ణమీద నుంచి వీస్తున్న గాలి తలుపు సందులగుండా తాకి జివ్వుమని వణుకు తోడేస్తూంది. నిండు యవ్వనంలో వున్న అమ్మాయి, అందునా చలికాలం, పక్కగా భర్త వుండగా – యింక ఆమె మనసెలా వుండి వుంటుందో వేరే చెప్పనక్కర్లేదు. జీవితంలో యవ్వనం తీయనిది అంటారు. యవ్వనంలో, పెళ్లయిన వాళ్లకు చలికాలం రాత్రులు మాధురి అనాలి. ప్రస్తుతం ఆ మాయని తీయదనం అనుభవించాలని ప్రసూన మనసు ఉవ్విళ్ళూరుతూంది.

గోడ గడియారం పది గంటలు కొట్టింది. చిటికెలు వేస్తూ ఆవులింత తీసింది ప్రసూన. అలా చేయటమంటే సుబ్బారావుకు చిరాకు. అది ప్రసూనకూ తెలుసుగనుకనే, పాపం ఆమెకు సమయానికి అక్కరకొచ్చింది. అలవాటుగా చిరాగ్గా చూశాడు సుబ్బారావు ప్రసూనవంక. ఒళ్ళు విరుచుకుంటున్న ప్రసూన తనవైపే చూస్తూ కనిపించింది. పైట జారిపోయింది. ఆశగా, గోముగా చూసింది ప్రసూన. ఒక్క క్షణం చలించాడు సుబ్బారావు. కానీ, ముందు రాస్తున్న విమర్శ పూర్తిచేయటం ముఖ్యమని తోచింది. మూయబోయిన పెన్నుమూత టేబుల్‌పైన పెట్టేసి, రాస్తున్న కాగితం తిరగేసి చదవటం మొదలెట్టాడు. నీరుగారిపోయింది ప్రసూన.

"ఏం రాతలండీ, పది గంటలు కావస్తుంటేనూ. మీ కవలే తలనొప్పి వస్తుంటుంది తరచుగా."

"నువ్వు పడుకో ప్రసూనా. నా జబ్బు సంగతి నాకు తెలుసుగానీ."

"నా మందు సంగతి మాత్రం తెలియదు." గొణుక్కుంటూ పడుకుంది ప్రసూన.

తెల్లవారబోతూంది. మెలకువ వచ్చిన సుబ్బారావుకు వంటింట్లో గిన్నెల చప్పుళ్ళు ఏమీ వినిపించటంలేదు.

"ప్రసూనా, కాఫీ" కేక వేశాడు.

ఊహుఁ ఏమీ ప్రయోజనం కనిపించలేదు. ముసుగు తీసి పక్కకు చూసేసరికి ప్రసూన కనిపించలేదు. "ఏమయిందబ్బా" అనుకుంటూ లేచి కూచున్న సుబ్బారావుకు మరో మంచంలో పడుకున్న ప్రసూన కనిపించింది. "ఓహో! అలక కాబోలు" అనుకుంటూ వెళ్లి ఆమెను లేపే ప్రయత్నం చేశాడు. పడుకున్నవాళ్లను లేపవచ్చు కానీ, మేలుకుని వున్న వాళ్ళనేం చేస్తాం? తెలుసుకున్నాడు, కవి కమ్ కోర్టుపక్షి సుబ్బారావు.

"యువరానర్, నిష్కారణంగా ముద్దాయికి యింతటి శిక్ష విధించటం అన్యాయమని మనవి చేసుకుంటున్నాం" అన్నాడు లాయర్‌లాగా.

"గొప్పే. నిష్కారణంగా శిక్ష వేయటానికి కోర్టు ఏమైనా పిచ్చిదనుకున్నారా?" అంది లేచి కూమంటూ ప్రసూన, మూతి ముడుచుకుని.

"అలకలోనే అలసిపోతే
యింత రేయీ నవ్విపోయేనూ,
ఎంతో చిన్నబోయేనూ..." ఏదో గుర్తున్న పాట పాడాడు సుబ్బారావు.

"కాస్త కళ్ళజోడు పెట్టుకుని చూడండి. చిన్నదైపోయీ, పోయీ, జాడలేకుండా పోయింది రేయి" అంటూ ఫ్లాస్కులోంచి కాఫీ వంపి పోసింది కప్పులో.

"ఆహా, నా భాగ్యము" కూనిరాగం తీస్తూ, "ఐతే కాఫీ చేసి నన్నేడిపించావన్న మాట" అన్నాడు కప్పు నందుకుంటూ.

నవ్వుకుంటూ వెళ్లిపోయింది ప్రసూన వంటింట్లోకి.

* * *

ప్రసూనకు ఎంతో అందమైన రాత్రుల్లో విరహాలు, ఆ తెల్లవారి అలకలూ అలవాటే. సుబ్బారావు ఒక పేరుమోసిన లాయరు దగ్గర గుమస్తా. పేరుకు గుమాస్తాయే కానీ, కేసుల విషయంలో సుబ్బారావు సలహా లేకుండా ఒక్కడుగయినా వేయడు వాళ్ళ లాయరు.

ఇక సుబ్బారావు పేరుమోసిన రచయిత, విమర్శకుడు. రచనల్లో ఆదర్శాలు వర్ణించటం, జీవితంలో ఆశయాలు అందుకోవాలని ఆశించటం అతని పని. కోర్టు వ్యవహారాలతోనూ, పత్రికల వాళ్ళకు గ్రంథ సమీక్షలు రాసివ్వటం, కథలు రాయటం లాటి వాటితోనూ, పగలు, రాత్రి అతనికి క్షణం తీరుబడి కాదు.

సుబ్బారావూ మనిషే. అతనికి అందరు మనుషులకులాగే పేరు తెచ్చుకోవాలని, డబ్బు సంపాదించాలని, సంసార సుఖం అనుభవించాలని కోరికలున్నాయి. అందుకే కథలు రాస్తున్నాడు. విమర్శలు



సుబ్బారావుక్కూడా చలిగానే వుంది. ఏదో ఆకలిగానే వుంది. కానీ మర్నాడు పత్రికవాళ్ళ కివ్వాల్సి వుందది. అందుకే పట్టుదలగా కూర్చున్నాడు. ఓసారి ప్రసూన వంక జాలిగా చూసి రాసుకోవటం సాగించాడు.

**దీపావళి పోటీలో రు. 800 లు బహుమతి పొందిన కథ !**



# రాదారి పడవ

**పాఠకుల బ్యాలట్‌కోసం వేస్తున్న రెండవ సీరియల్ కథ**

రాస్తున్నాడు. లాయరు దగ్గర గుమస్తా పని చేస్తున్నాడు. పెళ్లి చేసుకున్నాడు.

సుబ్బారావులాగే ఆయన భార్య కూడా మనిషే మరి ! ఆమెకూ అందరికిలాగే పెళ్లి చేసుకోవాలనీ, సంసారం చేయాలనీ కోరిక ఉంటాయి గదా ! ఐతే ఎటొచ్చీ ప్రసూనలో కోరికలు అణచుకోగల శక్తి లేదు. భర్త తనకు పనిలో సహాయం చేయాలనీ, ఆఫీసు నుండి వచ్చేటప్పుడు ముద్దుగా మల్లెపూలు తేవాలనీ, వాటిని ముచ్చటగా కురుల్లో ముడుచుకుని సాయంకాలం అలా నది ఒడ్డున షికార్లు చేయాలని, ప్రతీ రాత్రి వసంత రాత్రిగా గడపాలనీ కలలు కనేది. అందులో ఏదీ నిజం కాలేదు. ఐనా సుబ్బారావు మంచితనంతో, అవన్నిటినీ సర్దుబాటు చేసుకుంటూంటుంది. ఎంత సరిపెట్టుకున్నా ఆమె హృదయంలో ఏదో మూల అసంతృప్తి అస్పష్టంగా మూలుగుతూనే వుంటుంది. ఏమీ చేయలేక దాన్ని మనసులోనే దాచుకుంటుంది. ఐనా అది ఒక్కోసారి, సుబ్బారావు ఆఫీసుకు వెళ్లినాక, ఆమె కళ్ళల్లోంచి కన్నీళ్ళలాగా బయటి కొచ్చేది. ఆ నీళ్ళతో తలగడ తడిసిపోతే మాత్రం, సుబ్బారావు వచ్చేసరికి అది ఎండిపోతుంటుంది.

ఆ రోజు సాయంత్రం ఐదుకల్లా ఇంటి కొచ్చేశాడు సుబ్బారావు. నిజానికి చాలా ఆశ్చర్యపడింది ప్రసూన.

"కలయో, వైష్ణవ మాయయో, నేను ప్రసూనను కాదో..." అంది నవ్వుతూ.

"ఏమో, నాకేం తెలుసుగానీ నేను మాత్రం సుబ్బారావునే సుమా."

"ఐదు గంటలకు యింటికొచ్చి, నేను సుబ్బారావును అంటే ఎవరండీ నమ్మేది." ఇంక నమ్మకం కుదరనట్టుగా అంది.

"నేను సుబ్బారావునని నిరూపించుకోవటానికి ఈ అయిదు గంటలూ ఎక్కడ గడిపేదిరా దేవుడా? సరే. ఏ రోడ్డునో ఆశ్రయిస్తాను." అంటూ గుమ్మందాకా వెళ్లి, తలుపులు మూసేశాడు.

ప్రసూన వారం రోజులుగా ఎదురు చూస్తున్న క్షణం వచ్చింది. తుమ్మెద వాలిన ప్రసూనంలా పులకరించింది, ఆమె శరీరం. అతని కౌగిలిలో మెత్తగా కరిగిపోతూ, తీయగా మూలిగింది

"ఇలా మీ ఒళ్ళో చచ్చిపోయినా ఫరవాలేదనిపిస్తూంది."

"బాబోయ్, రేపు నాకు ముఖ్యమైన కేసుంది" కొంటెగా అన్నాడు సుబ్బారావు.

"నాకంటే మీకు ఆ కేసే ఎక్కువన్నమాట."

"కాదు కనుకనే నువ్వు లేకుంటే కోర్టుకెట్లా వెళ్ళేదీ అని అంటూంట."

"ఏమిటో ఆ కేసు."

"శృంగారంకు సంబంధించిన హత్య."

"రేపింగా ?"

"కాదు. హంతకుడి భార్యకు మరొకడితో సంబంధం వున్నదని తెలిసింది. అది తెలుసుకుని వెంటనే మనవాడు భార్యను చావచితకతన్ని కిరోసిన్ నాయిల్ పోసి అంటించాడు. నిజంగా ఎంత ఘోరం ?"

"ఘోరం అనుకుంటే, నిజానికి వాడి మనస్సు ఎంత మంది వుంటుందో ఆలోచించండి."

"ఎంత యిదయితే మాత్రం చిన్న తప్పుకు అంత క్రూరమైన శిక్షనా ?"

"చిన్న తప్పా ? పెళ్లాం మరొకడితో కులుకుతుందంటే వాడి మనస్సు ఎంత కుతకుత లాడిపోయి వుంటుందో మీ కెట్లా తెలుస్తుంది ?" కావాలని సంభాషణ పెంచింది ప్రసూన.

"తప్పు వాడి దగ్గర కూడా వుందికదా ? వున్నప్పుడు ఒప్పుకోవటానికి ఏముంది? అలా ఒప్పుకోలేక పోవటం కాకుండా ఆమెను నిర్దాక్షిణ్యంగా చంపటం అంటే ఎంత నేరం ?"

"చట్టం దృష్టిలో పెట్టుకుని, ఆ పరిధిలోనే ఆలోచిస్తున్నారు మీరు."

"కాదు ప్రసూనా. మానవతా దృష్టితో ఆలోచించినా వాడు చేసింది పెద్ద నేరం. మనిషిని చంపటమంటే ఎంత ఘోరం ?"

"పోనీలెండి. అదేదో రేపు మీ కోర్టులో వాదించమనండి మీ లాయరుగారిని."

"ఇది మా కేసు కాదులేవోయ్."

"పాపం. వాడెవడో బతికిపోయాడు" అంటూ "అవునూ, మీ కేసన్నారు — ఎన్ని అబద్దాలండీ. నిజానికి మీరు..." ఏదో అనబోయింది.

"ఊఁ మాటలు చాలు" అంటూ ఆమె పెదాల్ని బంధించాడు.

మాటలు ఆపేసింది కానీ ప్రసూన మనసులో అదే మెదులుతూంది. నిజానికి సుబ్బారావు అన్నది సరియైనదే. వాడు సరిగ్గా చూసుకుంటే మరొకరితో పోవాల్సిన అవసరం ఆమెకేమొచ్చేది ? అయితే మరొకరి విషయం కనుక యింత తేలికగా ఆలోచిస్తున్నాడు కానీ, అదే తనకి జరిగితే అంత పనీ చేయడా? అనుకుంది. చంపకపోయినా కనీసం భార్యను చావ చితకతన్ని విడాకులీయకుండా వుంటాడా ఎవడైనా ? ఆమె మనస్సు పరివరి విధాల పోతూంది.

అవునూ, 'అదే తనకి జరిగితే' అనుకుంది తను సుబ్బారావు గురించి. అంటే, అంటే...? అవును... అవును... అదే... అలాగే... తనకి జరిగితే...? అంటే...? తను...?

"ఏమిటోయ్ పరధ్యానం" సుబ్బారావు మాటతో వులిక్కిపడింది ప్రసూన. ఆమె గుండె వేగంగా, రెట్టింపు వేగంతో కొట్టుకుంటూంది.

మంచం దిగి, చీర సరిచేసుకుని, నిండుగా పైటకొంగు కప్పుకుని గుండెల్ని బిగపట్టుకుని వంటింట్లోకి వెళ్లింది.

* * *

దాదాపు పది రోజులు గడిచాయి. ఓరోజు పత్రిక చదువుతున్న ప్రసూనకు ఒక కథ చదవగానే, దాన్ని సుబ్బారావ్ ఏమంటాడో తెలుసుకోవాలనిపించింది.

మిలటరీ పని చేసే ఒక వ్యక్తిని, మేనమరదలు వరుసన పెళ్లి చేసుకున్న అమ్మాయి కథ. అతన్ని తప్ప మరొకర్ని చేసుకోనని తల్లిదండ్రుల నెదిరించి మిల్ట్రీవాణ్ణి పెళ్లి చేసుకుంటుందామ్మాయి. ఐతే తరచుగా భర్త యెడబాటు సహించలేక మరిదితో సంబంధం పెట్టుకుంటుందామె. ఈ విషయం తెలిసి తమ్ముణ్ణి ప్రశ్నించబోగా అతడు పారిపోతాడు. భయంతో ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుంటుంది. అతడు పిచ్చివాడయిపోతాడు. ఇదీ కథ.

ఎనిమిది గంటలకు గూడు చేరిన కోర్టుపక్షి, ప్రసూన కోరిక మీద ఆ కథ చదవటాని కుపక్రమించింది. కథ పూర్తి చేసి, పత్రిక మూసివేస్తూ, "ఈ కథ కసలు 'పిచ్చివాళ్ళు' అని పేరు పెడితే బాగుండేది" అన్నాడు.

"ఏం ? ఎందుకని ?" ప్రసూన యుద్ధానికి సన్నద్ధం అయింది.

"లేకుంటే అదో కథ, అందులోవీ పాత్రలేనా? ఒక కథ ద్వారా, లేక రచన ద్వారా రచయిత ఒక ప్రయోజనాన్ని ఆశించాలి. కనీసం ఒక ఆదర్శాన్ని చిత్రించాలి. అప్పుడే ఆ రచన కొంత కాలమైనా పాఠకుల హృదయాల్లో నిలిచిపోతుంది. అంతేగాని, అర్థం పర్థం లేని యిలాంటి కథలతో జరిగేదేమీ లేదు. ఉండదు."

"ప్రతి కథలో ఏం సాంఘిక ప్రయోజనం చూపించగలరు ?"

"ఉదాహరణకు ఈ కథనే తీసుకో ఐతే. గీత చనిపోకుండా రాజు కాపాడినా బాగుండేది. లేకపోతే గీత, మధును పెళ్లి చేసుకున్నా బాగుండేది."

"మరి యీ మార్పువల్ల వచ్చే ప్రయోజనం ఏమిటో ?"

# యువతరం

లైబ్రరీకి శలవువస్తే ఏదో పోగొట్టుకుంటున్నట్లుంటిది — రోజూ లైబ్రరీకి పోయే అలవాటున్న కోన శ్రీనివాసరావుకి — బి. యస్‌సి. చివరి సంవత్సరంలో వున్న ఈ యువరచయితకి గొప్ప రచయితనై పోవాలన్న కోరిక చాలా బలంగా వుంది. కథలు చదవటం, సినిమాలు చూడటం అంతేత రొటీన్ వ్యవహారాలుకదా ! యీ మధ్యనే సైకిల్ కొనుక్కొని దాని మీద తిరుగుతున్న శ్రీనివాసరావుకి వాళ్ల కాలేజీలో వున్న ప్లేగ్రవుండ్‌తో పెద్ద పనివుండదు. ఈ డిగ్రీ అయిపోయాక వైద్య విద్యలో ప్రవేశిస్తాడు. వీక్లీలో పడాలనుంటుంది — యితనికి. ఎన్. టి. ఆర్. ని మూశానిమధ్యనని చెప్పాడు. గోధుమ అన్నం యిష్టంలేదు. శ్రీమతి గాంధి అంటే గొప్ప గౌరవం వుంది. శరత్‌బాబు యితనికి ఎంతో యిష్టమైన రచయిత శ్రీనివాసరావుకి 'జీవనజ్యోతి' సినిమా వచ్చింది. ఫైనలియర్ కదూ బాగా చదువుకుంటాడని ఆశిద్దాం. [ పి ]



"గీత, మధుల్లా పెళ్లి చేసుకున్నవాళ్ళను ఈ సమాజం ఆదరించదు. కనీసం గీతను మనిషిలాగా చూడదు, ఆమె తిరిగి భర్తనే ఆశ్రయించినా. ఈ రచయిత ఉద్దేశంలో అలాంటి స్త్రీలకు ఆత్మహత్యే శరణ్యం అని చెప్పినట్టు కాదా? నిజానికి ఆ అమ్మాయి చేసిన తప్పు ఏమీ లేదుకదా? అలాంటి గీతల్ని లేదా నేనన్నట్టుగా పెళ్లి చేసుకునే మధు, గీతలను లోకం ఆదరించేట్టు చేయాలంటే వాళ్ళ నర్థం చేసుకోవాలి. నేను చెప్పినట్టుగా కథ వుంటే, నువ్వెప్పుడైనా అలాంటి వాళ్ళను ఎదుర్కుంటే వాళ్ళను అందరిలాగా అసహ్యించుకోవు."

"ఆఁ అంతా అనవసరమైన ప్రసంగం. మీరన్నట్టుగా కథలు చదివి మారగలిగితే లోకం అంతా ఎన్నడో మారేది."

"నిజమే. అలా జరుగదు. ఐతే అలా మారలేని తొంభైతొమ్మిదిమందితో కలిసి మనం దాన్ని వంద పూర్తిచేయడమెందుకు? అసలు..."

"అబ్బబ్బ పోనీండి. వెధవ సాహిత్యగోల."

"నువ్వేగా ఆరంభించింది."

"ఐతే మాత్రం. ఐనా ఏమిటండీ మీరు, నాచురల్‌గా ఆలోచించి చూడరు. ఎవరైనా అలాంటి పరిస్థితుల్లో ఏం చేస్తారు?"

"నిజానికి 'అలాగే ఎందుకు చేయాలి' అన్నది మనం ఆలోచించాల్సిన సమస్య. పెళ్ళానికి మరొకడితో శారీరక సంబంధం వుందని తెలిసినంత మాత్రాన పిచ్చివాడు కావలసిన పనేముంది?"

"ఏముందా? తను అప్రయోజకుడు అని తన భార్య నిరూపించినట్టుకాదా?" సుబ్బారావు ముఖం పరీక్షగా చూస్తూ అంది ప్రసూన.

"భార్యను శారీరకంగా తృప్తిపరచలేనంత మాత్రాన మగవాడు అప్రయోజకుడనుకుంటే, ఈ ప్రపంచంలో సగంమందికి పైగా అప్రయోజకులే నన్నమాట. ఐనా, మనసులు కలవనప్పుడు, ఒకరి మీద మరొకరికి ప్రేమ, అభిమానాలు లేనప్పుడు విడిపోవటమే మంచిది. దాని విషయమై మనసు పాడుచేసుకోవటమే పిచ్చిపని."

ప్రసూన మౌనంగా ఆలోచిస్తూంది.

"దేవిగారూ, ఆలోచనలు కట్టిపెట్టి కాస్త సాపాటు సంగతి చూస్తారా?" అన్న సుబ్బారావు మాటతో లేచి భోజనానికి ఏర్పాటు చేసింది.

భోజనం పూర్తికానిచ్చి ఏవో కేసు కాగితాలు చూసుకుంటున్నాడు సుబ్బారావు.

ప్రసూన మంచంమీద పడుకుంది. ఆమె మనస్సు పరిపరి విధాల పోతూంది. ఏమిటీయన మనస్తత్వం? నిజానికి ఏదయినా తనదాకా వస్తే గానీ తెలియదు ఎవరికైనా.

"అవునూ, "తనదాకా వస్తేగానీ..." అని సుబ్బారావు నన్నదంటే...? అంటే...? రావలసిందేమిటి? తను ... మరొకరితో ... ఎందుకు...? ఎందుకేమిటి? — అందుకే...? అ...దే...నా...జీవిత పరమార్థం?"

ఏదయినా అసలు ఈ మనిషితో తనకేమాత్రం సుఖం దొరుకుతూంది?

అంటే ... తను ... గీత ... సుబ్బారావు ... రాజు ... పిచ్చివాడు ...

"పిచ్చివాడు కావలసిన పనేముంది" — సుబ్బారావు ... మధు, గీతల పెళ్లి ... మధు ... తను... గీత — ఇలాగే ఆలోచిస్తూంది ప్రసూన. ఆమె మనసంతా వికలమైపోయింది.

కృష్ణమీది నుంచి వీస్తున్న గాలి జివ్వుమని ప్రాణాలు లాగేస్తూంది. ఐనా అది సుబ్బారావు కంటే మంచిదనిపించింది. గిలిగింతలైనా పెడుతూంది. కృష్ణ గల గల పారుతుంది. గడియారం 'టిక్, టిక్' మని వినిపిస్తూంది. సుబ్బారావు రాసుకుంటున్నాడు. ప్రసూన నిద్దర్లోకి జారుకుంది.

( ఇంకా వుంది )

## డాక్టర్ సలహాలు

ఎ. ఆర్. — గోపాలపురం

నా వయస్సు 22 సం.లు. నా కుడి మోచేయి దగ్గర రూపాయిబిళ్ళంత చర్మము కొంచము ఎర్రగా వుండి స్పర్శజ్ఞానము లేదు. ఇది వచ్చి ఒకటిన్నర సంవత్సర మయినది.

★ ఎర్రగా మచ్చ, అదీ కొద్ది సం.ల క్రితమే ఏర్పడటం, ఆచోట వున్న రక్తనాళములు అదుపు లేకుండా పెరగటాన్ని గాని, లేక చర్మంలో మామూలుగానే వుండే రంగు పదార్థములు — (పిగ్‌మెంట్స్) ఉదాహరణకు— 'మెలనిన్' వంటివి— తయారవటంలో కొన్ని అవకతవకలు జరగటాన్ని గాని సూచిస్తాయి.

ఏదైనదీ ప్రత్యక్షంగా చూసి నిర్ణయించవలసి వుండడంచేత, మీరు దగ్గరలో వున్న చర్మవ్యాధులలో తర్ఫీదు పొందినవారి సలహా, సహాయం పొందటం మంచిది.

వై. కె. ఎమ్. — నిజామాబాద్

నా వయస్సు 29 సం.లు. 6 సం.ల నుండి కడుపునొప్పి నన్ను బాధిస్తున్నది. నెప్పి మొదట వెన్నులో ప్రారంభమవుతుంది. తర్వాత నడుములో నెప్పిగా మారుతుంది. ఆ తర్వాత కడుపులో కొద్దిగా మొదలవుతుంది. పాలుతప్ప ఏ పదార్థములు తిన్నా వాంతులవుతాయి. ఆకలిమటుకు బాగానే వుంటుంది. ఇలా 10–15 రోజులు వుండి తగ్గుతుంది. తిరిగి నెల — రెండునెలల కొకమారు వస్తోంది. రక్తపరీక్ష, మూత్రపరీక్ష, ఎక్సరే చేయించాను. వాటిలో ఏలాంటి దోషము లేదు. మలపరీక్షలో మాత్రం కొన్ని క్రిము లున్నట్లు మాత్రం తేలింది.

★ ద్రవపదార్థములు తప్ప మిగిలిన వస్తువులు తిన్నవెంటనే డోకులు వెళ్లటం, కడుపునెప్పి వుండటం—దాని ఫలితంగా—వెన్ను నెప్పి ఏర్పడటం— కడుపులో "పుండు" (అల్సర్) వుండటాన్ని సూచిస్తుంది. ఈ అల్సర్ ప్రభావం కడుపు వెనుక వున్న భాగాలకు సోకటం వెన్ను, నడుము నెప్పి చేయటానికి కారణాలవుతాయి. బేరియంమీల్ ఎక్సరే తీయించి మంచి వైద్యులకు చూపండి. మిగతా జాగ్రత్తలు ఇదివరలోనే వ్రాశాను.

పి. బి. — హైదరాబాద్

నాకు రెండు నెలలుగా ఎడమమోకాలి క్రింది భాగము నొప్పిగా వుంటున్నది. కాలికి ఎలాంటి దెబ్బ తగలలేదు. బెణకలేదు. డెల్టాబుటాజోలిడిన్ వాడినా తగ్గలేదు. ఎడమకాలు మడచిన 'టక్ టక్' మని శబ్దము వచ్చునుగాని నొప్పిలేదు. నేను ఉదయం 8 గం.ల నుండి రాత్రి 12 గం.ల వరకు కంపోజిటర్‌గా పనిచేస్తున్నాను.

★ రోజుకి దాదాపు 16 గంటలు నిలుచుండి పని చేయటం మీ వృత్తికాబట్టి — దాని దృష్ట్యా పరిశీలిస్తే, మీరు పనిచేసే సమయంలో ("లెటర్స్" కంపోజ్‌చేసే సమయంలో) ఎడమకాలు మాత్రం క్రింద ఆనించి కుడికాలుని, అచ్చులువున్న స్టాండ్ పైన వుంచుతున్నారని నా ఊహ. ఒకవేళ అది నిజమైతే, బరువు రోజులో ఎక్కువకాలం ఒకే కాలుమీద వుండటంవల్ల ఆ కాలు నెప్పి చేయటంలో ఆశ్చర్యం లేదు. కొన్నాళ్లు ఆ కాలుమీద బరువు అన్ని నిలుచొనివుండటం మానండి.

ఎన్. ఎస్. ఆర్. — మదనపల్లి

మా మూడవపాప వయస్సు ఒకటిన్నర సంవత్సరాలు. నాల్గవనెల బిడ్డనుండి రాత్రులందు నిద్రపోదు. ఒకటే ఏడుపు. తల్లిపాలు లేవు. ఆవుపాలు పోస్తున్నాము. డాక్టర్లకు చూపించితే పరీక్షించి మరీ ఏడుపు ఎక్కువ అయిన రోజున నిద్రమందు యిచ్చేవారు. ఆ మందు రాత్రి పనిచేయకుండా పగలంతా నిద్రపోతుందేగాని ఆ ఏడుపు తగ్గే సూచనలు కన్పించలేదు.

★ తల్లిపాలు లేవనంగానే మనలో చాలామంది కృత్రిమాహారాన్ని యివ్వటం సహజంగా జరుగుతున్నదే. కాని, యిలా కృత్రిమాహారం యివ్వటంలోనే చాలామటుకు మార్పులు అవసరం అవుతాయి. పాలు యిచ్చే విషయంలో, పిల్లల బరువునిబట్టి పాల కొలత, పాలు — నీరు మిశ్రమంచేసే విధానం, మొదలయినవి గట్టి పదార్థాలను యిచ్చే సమయం మొదలయినవి తీర్మానించవలసి వుంటుంది. అసలే నీరు కలసిన పాలలో యింకా నీరు కలిపి పడితే శరీరానికి తగినంత ఆహారం లభించక పాప ఏడవటం జరుగుతున్నదని నా అంచనా!

ఎమ్. ఎ. ఆర్. — వైజాగ్

నాకు మెడక్రింద కంఠము దగ్గర ఎడమవైపు కొంచము ఎత్తుగా కాయలాగ 3 నెలల క్రిందట కనపడింది. డాక్టర్లకు చూపిస్తే 2 నెలల వరకూ ఏ మందులు ఇవ్వకుండా ప్రతి వారమూ పరీక్షించేవారు. "థైరాయిడ్ గ్రంధి" అన్నారు. "థైరాయిడ్ గ్రంధి" అంటే ఏమిటి? ఇది మనిషికి ప్రమాదమా? ఆపరేషన్ లేకుండా పోయే మార్గము లేదా? ఆపరేషన్ చేయించుకుంటే ఏమైనా ప్రమాదమా?

★ థైరాయిడ్ గ్రంధి అంటే — మన శరీరంలో ఉన్న కొన్ని ముఖ్యమైన "నాళములు లేని" (వాటి చర్యవల్ల ఉత్పత్తి అయ్యే పదార్థాలు సరాసరి రక్తంలో కలవటం అంటే ఏ నాళముల సహాయం లేకుండానే) గ్రంధులలో ఒకటి అని మాత్రమే చెప్పవలసి వస్తున్నది. ఈ గ్రంధి ఎక్కువగా పనిచేసినా, తక్కువగా పనిచేసినా మనిషిలో కొన్ని మార్పులు వస్తాయి. ఆపరేషన్ అవసరం అయ్యేదీ లేనిదీ, రోగాన్నిబట్టి, దాని తీవ్రతనుబట్టి, రోగి పరిస్థితిని బట్టి ఉంటుంది. ప్రమాదమనేది — కావాలని వైద్యులు తెప్పించరు కదా!!

—డా॥ కె. వెంకటేశ్వరరావు

సీరియల్

# శ్రావణ సంధ్య

**తాళ్ళూరు నాగేశ్వరరావు**

*(గత సంచిక తరువాయి)*

గంట తర్వాత నిద్రనుంచి లేచింది శాంతి.

ఆలోచనల బరువుతో మొహం గంభీరంగా వుంది. అదంతా తలనొప్పి ప్రభావం కాబోలు అనుకున్నాడు రాంమ్మోహన్.

"తలనొప్పి తగ్గిందా శాంతీ!" అన్నాడు రాంమ్మోహన్.

"తగ్గిందండీ!" శాంతి భర్త దగ్గరకు వచ్చి కూర్చుంది. రాంమ్మోహన్‌కు రిలీఫ్ వచ్చింది. ఆమె చేతులూ, చెంపలూ, నడుం దగ్గరా అరచేయి పెట్టి చూశాడు — వొళ్ళు ఏమైనా వెచ్చగా వుందేమోనని.

"జ్వరం ఏమీ లేదులెండి."

"నా భయం నాది. ఇప్పుడున్న స్థితికి తోడు నీకేదైనా జరిగితే, మేం ఏంకావాలి?"

"నాకు ఏమీ జరగదులెండి. భగవంతుడు అంత నిర్దయుడు కాదు. ఒక్కొక్కప్పుడు మనుషుల నిర్దయకే మనసులు తట్టుకోలేకపోతూవుంటాయి. భగవంతుడు విధించే శిక్షను నిగ్రహంతో అనుభవించ వచ్చు గానీ, మనుషులు విధించే శిక్షను అనుభవించడం కష్టమవుతూ వుంటుంది."

"వేదాంతం మాట్లాడుతున్నావేమిటి శాంతీ! ఏం జరిగిందేమిటి?"

"నాకేమీ జరగలేదండీ! లోకం స్వభావాన్ని గురించి మాటాడుతున్నాను."

"లోకమూ, లోకంలోని మనుషులూ, నైజాలూ ఇప్పుడు నీకు బాగా అర్థమవుతూ వుండి వుంటాయి. జీవికకోసం తిరుగుతున్నావుగా! ఇప్పుడు నాకు అనిపిస్తోంది శాంతీ!"

"ఏమిటండీ!"

"జీవితమనేది సుఖాల్లో లేదు. కష్టాల్లోనే వుంది. కష్టాలను ఎదుర్కోవడంలోనే జీవితానికి సార్థక్యముంది. సుఖమనేది మత్తులాంటిది. వ్యక్తిలోని సామర్థ్యాన్ని, ఆలోచనా నైపుణ్యాన్ని, మహత్తర శక్తుల్ని ఈ మత్తులాంటి సుఖం జోకొడుతుంది. మనిషికి కష్టాలు వచ్చినప్పుడే వాటిని అధిగమించడానికి తన ఆలోచనా శక్తినీ, ధైర్యాన్నీ, విశ్వాసాన్నీ, తెలివితేటల్నీ ప్రదర్శిస్తాడు."

"ఎంత ప్రదర్శించినా కొన్ని సమస్యలకు పరిష్కారాలు దొరకవండీ! ఆర్థికావసరాలకూ, నైతిక విలువలకూ సంఘర్షణ ఏర్పడినప్పుడు — మానవుడు వేటికి ప్రాధాన్యమివ్వాలి? వేటిని సడలించుకోవచ్చు? అనేది సులభంగా తేలేదికాదు. ఈ సంఘర్షణకు పరిష్కార మార్గాన్ని సూచించే టట్లు నిర్ణయం తీసుకోవడం చాల కష్టం. కొంతమంది మారే కాలాన్నిబట్టి విలువలు మారా లంటారు. మరికొంతమంది కాలం మారినా విలువలు మారనక్కర్లేదంటారు. కాలంతోపాటు మారే విలువలు విలువలే కాదంటారు."

రకంగా గానీ విలువల్ని గురించి మాట్లాడేవారు రెండు రకాలైనవారు వుంటారు శాంతీ! జీవితంలో ఆర్థికంగా బలపడినవారు; ఆర్థికంగా బలహీనమైన వారు. ఆర్థికంగా బలంగలవారు నైతిక, సామాజిక విలువల్ని పూర్వ సంప్రదాయాల ప్రకారం నిలబెట్టుకొనిరావాలంటారు. ఆర్థికంగా బలహీనమైన వారు ఆ విలువలన్నీ 'కడుపు నిండిన వారికి గానీ, కడుపు మాడేవాళ్లకు కాదు' అంటారు. ఆర్థిక సమస్యల పరిష్కారానికి ఒక్కొక్కప్పుడు సామాజిక, నైతిక విలువల్ని ఖాతరు చేయనక్కర్లే దనేది వాళ్ళ వాదన. అంచేత నా ఉద్దేశమేమిటంటే — సమస్యకు పరిష్కారాన్ని ఆర్థికపరంగానే ఆలోచించి చేసుకోవడం మేలని. ఎందుకంటే, డబ్బుగలవాడు సాంఘికంగా, నైతికంగా ఏ తప్పు చేసినా ఈ లోకం క్షమిస్తూన్నది — స్త్రీ కానీ, పురుషుడు కానీ. అదే డబ్బు లేనివాడు ఏ పొరపాటు చేసినా — లోకం వేలెత్తి చూపిస్తూన్నది."

శాంతి మనస్సు చివుక్కుమన్నది భర్త అభిప్రాయాలకు.

"పొద్దున బస్సు స్టాప్‌లో నా స్నేహితురాలు ఒకామె కనబడిందండీ! నాతో తన గోడునంతా చెప్పుకుంది. తన కెదురైన సమస్యకు పరిష్కార మార్గం అడిగింది. అది క్లిష్టమైన సమస్య."

"ఏమిటది?"

"సమస్య మీకు చెబుతాను. పరిష్కారానికి సూచనలు యివ్వండి."

"చెప్పు" సిగరెట్ తీశాడు రాంమ్మోహన్. వెలిగించింది శాంతి.

"ఆమె పేరు శ్యామల. బి. ఏ. దాకా చదువు

**జరిగిన కథ 6:** ప్రేమించి పెళ్లి చేసుకున్న శాంతి, రాంమ్మోహన్‌ల అనురాగ ఫలం నీలిమ. వారు ఎంతో వైభవంగా తమ ఏడవ వెడ్డింగ్ యానివర్సరీ జరుపుకుంటారు. శాంతి బావ రాజారావ్ వచ్చి వెళుతుంటాడు. స్కూటర్ ప్రమాదంలో కాలు చేయి పోగొట్టుకుంటాడు రాంమ్మోహన్. ఆర్థిక యిబ్బందుల్లో కూడా పూర్వంలాగా జరగాలనే రాంమ్మోహన్ మనస్తత్వం శాంతిని బాధిస్తుంది రాంమ్మోహన్‌కు తిరిగి తాగుడు అలవాటు చేస్తున్న రాజారావ్‌ని అవమానించి పంపుతుంది శాంతి. రాంమ్మోహన్ పనిచేసిన కంపెనీలోనే ఉద్యోగం సంపాదిస్తుంది శాంతి. ఉద్యోగం కంటిన్యూ కావాలంటే తన శీలాన్ని అర్పించమన్న మానేజింగ్ డైరెక్టర్ రఘునాథ్ అంటే అసహ్యించుకుంటుంది శాంతి.

కుంది. చాల బీద సంసారం. తండ్రి యు.డి.సి. గా పనిచేసేవాడు. కాని రెండేళ్లక్రితం పక్షవాతం వచ్చి ఇంట్లోనే వుంటున్నాడు. నలుగురు పిల్లలు. శ్యామల పెద్దది. మిగతావాళ్లు చిన్నవాళ్లు. హైస్కూల్లో చదువుకుంటున్నారు. ఆ కుటుంబం మీద విధి కక్ష తీర్చుకున్నట్టు, శ్యామల తల్లి సంవత్సరం క్రితం యూటరస్ క్యాన్సర్‌తో కన్ను మూసింది. ఉద్యోగకాలంలో తండ్రి కూడబెట్టింది ఏమీ లేదు. కాస్తో కూస్తో వుంటే పిల్లల చదువులకూ, తల్లిదండ్రుల జబ్బులకైన మందులకూ అయిపోయింది. వేరే జీవనాధారం లేదు. తండ్రి కొచ్చే పెన్షన్ వారంరోజుల గ్రాసానికి చాలదు. పాపం! ఇరవైయేళ్ల వయస్సుకే శ్యామలమీద ఆ సంసారాన్ని ఈదుకొచ్చే బరువూ బాధ్యత పడింది."

"పాపం! ఒక్కొక్కళ్లకు భగవంతుడు జీవితం మొదటి దశనుంచే కష్టాలు కలగజేస్తాడు. ఊఁ! చెప్పు."

"కుటుంబానికి పస్తులుండే గతి పట్టింది. ఆ దారిద్ర్యాన్ని చూస్తోన్నకొద్దీ శ్యామలకు కడుపు తరుక్కుపోతూన్నది."

"ఏదైనా ఉద్యోగం చేయొచ్చుగా!"

"చేయవచ్చు. కాని ఇచ్చేవారెవరు? వాళ్లకు సిఫార్సులు కూడా ఏమీ లేవు. ఆమె మూడునెలల నుంచీ ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌ల చుట్టూ, కంపెనీ ఆఫీసులచుట్టూ తిరుగుతూనే వుంది. కాని ఉద్యోగం లభించే జాడలెక్కడా దొరకలేదు. అంతా మృగతృష్ణలాగా తోచసాగింది. ఆ వయస్సుకే జీవితంతో, ఎదురైన దారిద్ర్యంతో, పస్తులతో భయపడిపోయింది. అలావుండగా ఒక ఆఫీసులో ఒక క్లర్క్ పోస్టుకు ఖాళీ వుందని తెల్సింది. అక్కడకు పరుగెత్తుకెళ్లింది. కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదటానికి ప్రయత్నించినట్టు, ఒక సిఫార్సు పట్టుకొని ఆఫీసు మేనేజరు దగ్గరకు వెళ్లింది. ఆ మేనేజరు మూడురోజులు తనచుట్టూ తిప్పుకొని రెండు షరతులకు ఒప్పుకొంటె — మరునాటికి ఉద్యోగం వస్తుందన్నాడట."

"ఏమిటా షరతులు?"

"మొదటి షరతు అంత యిబ్బందైనదేమీ కాదు. మొదటి నెల జీతం మేనేజరుకు సమర్పించడం. అలా ఒకేతఫా యివ్వడం వీలుకాకపోతే మూడు వాయిదాలమీద యివ్వచ్చు. రెండో షరతు భయంకరమైంది."

"ఏమిటది?"

ఎందుకో హఠాత్తుగా శాంతి గొంతు మూగ వోయింది. మాటలు వెలువడలేదు.

"చెప్పు. ఆపావేం?"

"చెప్పడానిక్కూడా నోరు రానటువంటి షరతు. కన్నెపిల్ల కలలోకూడా రాగూడనటువంటిది. ఆ ఆఫీసు డైరెక్టరుకు ఆమె ఒకరాత్రి శరీరాన్ని అప్పగించాలట. ఆయన కామానికి కొవ్వొత్తిలా కరిగిపోవాలట. చూడండి ఎంత దారుణమైన షరతో!"

"అది మనకు దారుణంగా కనబడొచ్చు శాంతీ! కాని సహాయం చేసేవాడికి అది స్వల్పంగా కనబడుతుంది. ఈ లోకంలో వ్యవహారాలన్నీ ఇచ్చిపుచ్చుకొనే పద్ధతిమీదే జరుగుతూ వుంటాయి. ఇచ్చిపుచ్చు

"నైతికంగాగానీ, సామాజికంగాగానీ, మరో

కొనేది డబ్బు కావచ్చు; ఆస్తి కావచ్చు; అనుభవం కావచ్చు; సుఖాన్ని కలిగించే సాధనం కావచ్చు. మరే దైనా కావచ్చు. ఇచ్చే వాడికున్న స్వార్థం, పుచ్చుకొనే వాడి స్వార్థం వేరు కావచ్చు. అనేక రకాల స్వార్థాల ప్రాతిపదికమీద లోక వ్యవహారాలు జరుగుతూన్నప్పుడు నీ ఫ్రెండ్ ఇలాంటి సంకట పరిస్థితుల్లో పడడం ఆశ్చర్యమేమీ కాదు శాంతీ! ఈ సందర్భాలూ, సన్ని వేశాలూ కొత్తవేమీ కావు. ఉద్యోగాలలో ప్రమోషన్లు తెచ్చుకోవటానికి పై ఆఫీసర్లకు భార్యల్ని తార్చే భర్తలు వున్నారు; కూతుళ్లను హోటళ్ల గదులకు పంపించే తండ్రులున్నారు. ఆకలికోసం కొంతమంది అవినీతికి పాల్పడితే, హోదాకోసం మరికొంతమంది అవినీతిని లక్ష్యపెట్టరు. ఇంకొంతమంది సుఖంకోసం అవినీతిని ఆరాధిస్తారు. వీరందరూ సామాజిక కట్టు బాట్లను ఖాతరుచేయరు.''

''శ్యామల విషయంలో మీ ఉద్దేశాన్ని చెప్ప లేదు.''

''ఇవన్నీ వ్యక్తిగత సమస్యలు శాంతీ! ఒకరి సలహా సంప్రదింపుల ఆవశ్యకతేముంటుంది? తమ ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా తామే పరిష్కార మార్గాలు ఎన్నుకొని, ఆ ప్రకారం వ్యవహరించాలి. అవినీతి బురదలోకి దిగమని ఎవరూ ప్రత్యక్షంగా సలహా యివ్వరు. ఆమెకు ఆమే తేల్చుకొని, ఆత్మ నిర్దేశించిన నిర్ణయం ప్రకారం నడుచుకోవాలి. సాధారణంగా యిలాంటి పరిస్థితుల్లో యిరుక్కున్న వాళ్లు నైతిక విలువలకు అంతగా ప్రాధాన్యాన్ని యివ్వరు. జీవితంలో ఆర్థిక యిబ్బందుల్ని ఎదుర్కో వడ మంత ప్రత్యక్ష నరకం మరోహటి లేదు. ఆ నరకం నుంచి విముక్తి పొందటానికి మనుషులు నీతినీ, న్యాయాన్నీ పక్కనబెట్టడంలో వింత ఏమీ లేదు. శాంతీ! నీ ఉద్దేశమేమిటి?''

శాంతి గొంతులో పచ్చిమిరపకాయ యిరుక్కు న్నట్లయింది.

''నాకేమీ ఉద్దేశం పాలుపోకనే మిమ్మల్ని అడిగానండీ! మీరన్నట్టు — ఇది పూర్తిగా వ్యక్తిగత మైంది. సాధారణంచేసి మాటాడలేం. కొంతమంది ఆర్థిక వొత్తిడులకు లోనై నీతిని లెక్కచేయక పోవచ్చు. మరికొంతమంది పరుగెత్తి పాలు త్రాగే కంటె నీతికి నిలబడి నీళ్లు త్రాగుదామని అనుకో వచ్చు.''

''పోనీలే, మనకు ఇప్పుడివన్నీ దేనికి? ఓ గుక్క కాఫీ పెట్టు'' అన్నాడు రాంమ్మోహన్.

మంచంమీద నుంచి లేచి వంట గదిలోకి వెళ్లింది శాంతి.

## *17*

ఏం మాట్లాడుతూన్నా, ఏ పని చేస్తూన్నా, ఏం ఆలోచిస్తూన్నా శాంతి మనస్సులో — ఉద్యోగం కంటిన్యూ కావడానికి రఘునాథ్ పెట్టిన షరతు భీకరంగా కనబడజొచ్చింది. ఒక కట్టు కథ అల్లి ఆ అంశంమీద భర్త అభిప్రాయాన్ని పరోక్షంగా తెలుసుకుంది. అయినప్పటికీ ఆమె మనస్సు తృప్తి పడలేదు. తనకు తానుగా తేల్చుకోవాల్సిన సమస్య. ఇది తనకు అగ్నిపరీక్ష. ఒక పక్కన కరాళ దంష్ట్రగ్నులతో విరుచుకుపడబోతూన్న దారిద్ర్యం, ఆకలీ, ఆర్థిక సమస్యలు, అలవాటులేని చేదు అనుభవాలు. మరోపక్కన మకుటాయమాయమైన సామాజిక, నైతిక, హృదయ సంబంధమైన విలువలు. ఈ రెండింటి సంఘర్షణ సందర్భంగా తాను తీసుకొనే నిర్ణయాలపై తన సంసారం భవిష్యత్తు ఆధారపడి వుంటుంది. ఆ నిర్ణయాల ననుసరించే తన జీవిత పోరాటం స్వరూప స్వభావాలు రూపురేఖలు దిద్దుకొంటాయి — అనుకొంది శాంతి ఆ రాత్రి వంటజేస్తూ.

ఆ రాత్రి భోజనాలైన తర్వాత నీలిమ త్వర గానే నిద్రబోయింది.

వంట యిల్లు సర్దుకొని ఏదో పాత పత్రిక పుచ్చుకొని నీలిమ పక్కనే మేను వాల్చింది శాంతి.

ముసుగుతన్నిపెట్టుకొని పడుకున్నాడు రాంమ్మోహన్. మధ్య మధ్యలో పొడిదగ్గు దగ్గుతున్నాడు.

''రెండు మూడు రోజుల్నుంచీ ఎందుకో దగ్గుతున్నారు? కాఫ్‌సిరప్ యిచ్చేదా?''

''ఆఁ! ... అదే పోతుందిలే!''

''అసలు సిగిరెట్లు మానేస్తే మంచిదండీ. దానివల్ల ఆనందమా, ఆరోగ్యమా?''

''తాగనివాళ్లకు అలాగే వుంటుంది శాంతీ! తాగేవాళ్లకే అందులో మజా తెలిసేది!''

''ఏం మజాయో, మన్నో! స్మోకింగ్‌వల్ల ఎన్నో జబ్బులు వస్తాయని డాక్టర్లు అంటున్నారు. ఆమధ్య రీడర్స్ డైజెస్టులో మెడికల్ ఎక్స్‌పర్టులైన అమెరికన్ డాక్టర్ల బృందం రిపోర్టు చదివాను.''

''ఆ రిపోర్టుల కేమొచ్చెలే! డాక్టర్లే చాల మంది గొలుసుకట్టుగా తాగుతూవుంటారు. వాళ్ల ఆరోగ్యాన్ని గురించి వాళ్లకు తెలియదా?''

''మీది మరీ మొండివాదనండీ!''

''పడుకో! అసలే మధ్యాహ్నం తలనొప్పిగా వుందన్నావ్.''

''నిద్రరావడం లేదండీ!''

''నిద్ర రాకపోతే, లైటు ఆర్పేసి యిలా నాదగ్గరకు రా! నాకూ నిద్రరావడంలేదు. కులా సాగా కబుర్లు చెప్పుకుందాం.''

ఓ నిముషంపాటు నిశ్శబ్దంగా వుండి, లైటు ఆర్పేసి, మెల్లగా భర్త మంచంమీదకు చేరింది శాంతి.

ఉన్న ఒక్క చేతినీ ఆమె నడుంచుట్టూ బిగించి, బాగా దగ్గరకు లాక్కొని, కౌగిలించుకొని పడుకొని, ఆమె గుండెల మధ్య వెచ్చగా మొహం దాచుకున్నాడు రాంమ్మోహన్. మునివేళ్లతో అతని వొత్తైన తల వెంట్రుకలను ప్రేమగా, గోముగా నిమురుతూ ఆలోచిస్తూన్నది శాంతి.

''నీకు ఉద్యోగం దొరికింది. ఇకముందు ఆర్థికంగా యింత యిబ్బందిపడక్కర్లేదు. మనకీ మంచిరోజులు వస్తున్నాయి శాంతీ!''

ఎక్కడకక్కడ మనస్సుతో రాజీపడడం మానవుడు అనాదినుంచీ పెంచుకొన్న నైజం.

''ఏం ఉద్యోగమో!'' అంది శాంతి అప్రయ త్నంగా.

ఉలిక్కిపడ్డాడు రాంమ్మోహన్.

''అదేమిటి శాంతీ! ఏమైంది ఉద్యోగానికి?''

తన పొరపాటును వెంటనే తెల్సుకుంది శాంతి.

''ఆఁ! ...ఏం కాలేదు? ఉద్యోగం సక్ర మంగా నిర్వహించాలిగదా! నాకు కొత్తాయె! కొన్నాళ్లు పోతేగానీ ధైర్యం రాదు. విశ్వాసం కుదరదు.''

''దానిదేముంది? క్రమేపీ అవన్నీ అలవాటు అవుతాయి. మనలో ఓర్పూ, అణకువా, విధ్యుక్త ధర్మానికి కట్టుబడివుండే ప్రవృత్తీ వుండాలి. కంపెనీ ఉద్యోగం కనక ఉద్యోగి శక్తిసామర్థ్యాలకు గుర్తింపు వుంటుంది. గవర్నమెంటాలిటే, వైకుంఠ



పాలీ ఆటలూవలె పాము పాలిట పడటాలూ ఉండవు. చిత్తశుద్ధితో పనిచేసేవాడు ఎప్పుడూ మెట్లు ఎక్కుతూనేవుంటాడు. ఎక్కిన మెట్టు కిందికి దిగకుండా చూసుకోవడంకూడా ముఖ్యమే. కింది వాళ్లకూ, పైవాళ్లకూ సాధ్యమైనంతమేరకు అసంతృప్తి పర్చకపోవడమే ఉద్యోగ నిర్వహణలో వున్న చిట్కా.''

``అవుననుకోండి! యాజమాన్య వర్గంవారిని సంతృప్తిపర్చడం ఎల్లప్పుడూ మన చేతుల్లోనే వుంటుందా?''

``ఉండేట్టు చూసుకోవాలి. ప్రభుత్వోద్యోగాలకూ, ప్రయివేటు వ్యవస్థల్లోని ఉద్యోగాలకూ బోలెడంత తేడా వుంది శాంతీ! ప్రభుత్వోద్యోగంలో ఒకసారి స్థిరపడిన తర్వాత వాడు పనిచేసినా, పని చేయకపోయినా, ఇంటి అల్లుడిలాగా కాలుమీద కాలేసుకు కూర్చున్నా — ఎవ్వరూ ఏం చేయలేరు. ప్రయివేటు వ్యవస్థల్లో అలా కుదరదు. టైం ప్రకారం ఆఫీసుకు రావాల్సిందే. షెడ్యూల్ టైం ప్రకారం వాళ్లువంచి పని చేయాల్సిందే! అలా చేసినవాడికే ఉద్యోగాల్లో ప్రమోషన్లు త్వరగా వస్తాయి. ఇతర్త్రా ప్రయోజనాలు సమకూరతాయి.''

``ఇప్పుడవన్నీ దేనికిలెండి. ఇంకా యేమైనా కబుర్లు చెప్పండి.'' అంది శాంతి ఆ సంభాషణ పట్ల అయిష్టతను వ్యక్తపరుస్తూ.

``అవును. పక్కన అందమైన భార్యను పెట్టుకొని, ఈ వ్యర్థమైన కబుర్లతో కాలాన్ని వృధాపుచ్చడం దేనికి? అంతేనా?...బాగా చెప్పావు. జీవితంలో యిలాంటి మధుర క్షణాలు `వేస్ట్' అయితే, మళ్లీ రావు'' అంటూ మెరుపుమీద మేఘంకు మల్లే ఆమెలో లీనమైయ్యాడు రాంమ్మోహన్.

కొన్ని నిముషాలపాటు ఆ భార్యాభర్తలిద్దరూ ఈ లోకాన్నీ, మనుషుల్నీ, ఆర్థిక బాధల్నీ, అన్యాయాలనూ, అక్రమాలనూ, కుళ్లనూ పూర్తిగా మర్చిపోయారు. ఆ పిమ్మట రాంమ్మోహన్ సొమ్మసిల్లి నిద్రబోయాడు. శాంతికి నిద్రబట్టలేదు. లేచి కూర్చుంది. బెడ్‌లైట్ మసకకాంతిలో భర్తకేసి రెప్పవేయకుండా చూడసాగింది.

నిశ్చింతగా, చీకూ చింతా లేకుండా, ప్రశాంతంగా నిద్రబోతున్నాడు రామ్. తాను అలా నిద్రబోలేదు. తనముట్టూ అనేకమైన సమస్యలు. తనలో తనకు సంఘర్షణ. ఏదో ఒక నిర్ణయానికి రావాలి తను — ఈ రెండురోజుల్లో. ఆ నిర్ణయం మీదనే తన భవిష్యత్తూ, తన సంసారం భవిష్యత్తూ ఆధారపడివుంటాయి. ఈ ఉద్యోగంలో చేరి ఆర్థికంగా పుంజుకొని, భర్తకూ, కూతురుకూ తిండికీ, బట్టకూ, దైనందిన అవసరాలకూ ఏ లోటూ లేకుండా హాయిగా కుటుంబం గడిచిపోయేట్లు నిర్ణయం తీసుకోవడమా? పవిత్ర బంధానికి కట్టుబడి, నీతికీ, నిజాయితీకీ నిలబడి, సాంప్రదాయిక విలువల్ని గౌరవిస్తూ నిత్య దారిద్ర్యంతో, నరక ప్రాయమైన ఆర్థిక బాధల్ని అనుభవిస్తూ, కుటుంబాన్ని గతుకుల దారిలో నడిపించేటట్లు నిర్ణయం తీసుకోవడమా?

## శ్రావణ సంధ్య

ఏం చేయడం?
ఎట్లా ప్రవర్తించడం?
ఏది సముచితమైన నిర్ణయం?

తాను రామ్‌ను మోసం చేయలేదు. ద్రోహం చేయలేదు. పవిత్రతను కోల్పోలేదు. భగవంతుడు ఎంత యిస్తే అంతే! ఎట్లా బ్రతకమంటే అట్లాగే! నుదుట వ్రాయనిదే, తాను ఆశించి మాత్రం ప్రయోజనమేమిటి? రామ్‌ను హృదయానికి హృదయంగా, ప్రాణానికి ప్రాణంగా ప్రేమించింది. పరిస్థితులు తల్లకిందులైతేమటుకూ, ఓడలు బళ్లు అయితే మాత్రం మనసుల్నీ, మమతల్నీ మార్చుకోవాలా? ప్రేమానురాగాలను తగ్గించుకోవాలా? వైవాహిక బంధాలను తొలగించుకోవాలా? పెళ్లినాడు చేసుకొన్న ప్రమాణాలేమిటి? సుఖంలో, దుఃఖంలో, సంతోషంలో, ఆనందంలో, ఎట్లాంటి పరిస్థితులలోనైనా, ఏ విధమైన కష్టకాలంలోనైనా ఒకరికొకరు పరస్పరమైన ప్రేమానురాగాలతో, మమతానుబంధాలతో, చేదోడు వాదోడుగా, పవిత్రంగా కలిసిమెలిసి వుండాలి. ఆ ప్రమాణానికి విరుద్ధంగా తాను ఎట్లా నిర్ణయం తీసుకోగలదు? తీసుకోలేదు. దాంపత్య జీవితాన్ని మలినం చేయలేదు. ఉద్యోగం నిమిత్తం కట్టుకున్న భర్తకు అర్పించిన శరీరంపై మరో మగవాడికి అధికారాన్ని దత్తం చేయలేదు. తను నైతికంగా పతనం చెందలేదు — పరిస్థితులు ఎంత హీనస్థితికి దిగజారినా! — అంతే!

ప్రగతికి మూలం
క్రమశిక్షణ

కంపెనీలో ఉద్యోగం అక్కర్లేదు.

రఘునాథ్ మోహం మళ్లీ చూడనవసరంలేదు.

అయితే? — రేపట్నుంచీ బ్రతకడమెట్లా? అవిటివాడైన భర్తనూ, పసిదైన నీలూనూ పోషించడ మెట్లా? జీవన మార్గమేది?

ఏం చేయాలి?

ఏం నిర్ణయం తీసుకోవాలి?

అలా ఆలోచిస్తూనే అలసిపోయి ఏ అర్ధరాత్రికో నిద్రబోయింది శాంతి.

### 18

బాగా పొద్దుపోయి నిద్రపోవడంతో శాంతి లేచేటప్పటికి సూర్యోదయమైంది. అక్కడికీ రాంమ్మోహన్ రెండు మూడుసార్లు కేకలు వేశాడు— లేవమని. నీలిమ తట్టి లేపేవరకూ లేవలేదు శాంతి.

``ఏమిటి అంత మొద్దునిద్ర! ఇవాళ ఆఫీసుకు వెళ్లవా?'' అన్నాడు రాంమ్మోహన్.

``ఉహూ!'' అంది శాంతి వొళ్లు విరుచుకొంటూ.

``ఏం?''

అంతలోనే శాంతి మోహం సీరియస్ అయిపోయింది. ఏం సమాధానం చెప్పాలి? నమ్మేటట్లు చెప్పాలి.

``ఎందుకెళ్లవు? చేరి వారం రోజులు కాలేదు. అప్పుడే సెలవులు పెడుతున్నావా?'' అన్నాడు రాంమ్మోహన్ విసుగ్గా.

``వొంట్లో బావుండలేదండి!''

``ఏమైంది?''

``ఎమ్. డి. గారి పర్మిషన్ తీసుకున్నానండి! మీరు ప్రతి చిన్నదానికీ గాబరా పడకండి.''

``అది కాదు శాంతీ!...'' అంటూ రాంమ్మోహన్ ఏదో అనబోతూండగానే బయట ఎవరో తలుపు కొట్టిన చప్పుడైంది. ఇరువురూ మొహమొహాలు చూసుకున్నారు. — ఆ వచ్చింది ఎవరు? అన్నట్టు. అంత ఉదయమే రాజారాం రాడు. పనిమనిషిని ఇంకా పెట్టుకోలేదు. పాల సీసాలు ఇచ్చే కాంతమ్మ అప్పటికే వచ్చి వెళ్లింది.

శాంతి లేచి, అద్దంలో మొహం చూసుకొని, ముంగురులూ, బొట్టూ సర్దుకొని, వెళ్లి వీధి తలుపు తీసింది.

ఎదురూగ్గా ఇద్దరు వ్యక్తులు నిలబడి ఉన్నారు. ఒకాయనకు నలభై అయిదేళ్లదాకా వుంటాయి. లావుగా, నల్లగా, పోతపోసిన విగ్రహంవలె ఉన్నాడు. రెండో వ్యక్తికి ముప్పై యేళ్లకంటె వుండవు. సన్నగా, సర్వి బాదులా ఉన్నాడు. ఇద్దరూ ప్యాంట్లూ, స్లాకులూ ధరించి ఉన్నారు. వాళ్లను శాంతి ఎప్పుడూ చూడలేదు. పొరపాటున ఎవరో ఇల్లు అనుకొని తన ఇంటి తలుపులు తట్టారేమో ననుకుంది.

``ఎవరు కావాలి?'' అంది శాంతి సౌమ్యంగా.

``రాంమ్మోహన్‌గారి ఇల్లు ఇదేనా?'' అన్నాడు లావుపాటి వ్యక్తి.

``ఆఁ!''

``వారితో కొంచెం పని వుండి వచ్చాం'' అన్నాడు సన్నపాటి వ్యక్తి.

శాంతికి విపరీతమైన ఆశ్చర్యమేసింది — వాళ్లకు రామ్‌తో పని వుండటమేమిటి? రామ్ వీధి మొహం చూసి ఎన్నాళ్లయింది? స్నేహితుల్లా కూడా లేరు. వాళ్లను లోపలకు వచ్చి కూర్చోమన్నది శాంతి

వాళ్లు దిక్కులు చూసుకుంటూ లోపలకు వచ్చారు. వాళ్లను చూడగానే రాంమ్మోహన్ గుండె చెదిరిపోయింది.

``కులాసాగా వున్నారా?'' అంటూ వాళ్లు కుర్చీలు రాంమ్మోహన్ మంచం దగ్గరకు లాక్కున్నారు. ద్వారం పక్కనే శాంతి నిలబడింది. రాంమ్మోహన్ మొహంలో అలజడి, వ్యాకులపాటూ స్పష్టంగా గోచరిస్తున్నాయి. వాటిని శాంతి కనిపెట్టింది. శాంతిని వంట గదిలోకి వెళ్లమని రాంమ్మోహన్ కళ్లతో సైగచేశాడు. ఆమెలో ఏదో దడ పట్టుకుంది. ఎన్నడూ యింటికిరాని వ్యక్తులు వచ్చారు. ఎందుకో! ఏం జరగబోతోందో! అనుకుంటూ వంట గదిలోకి వెళ్లింది శాంతి.

``వెరీ బాడ్‌లక్ మోహన్‌బాబూ! ఆ యాక్సిడెంట్‌ను గురించి విన్నాంగానీ, వచ్చి చూడటానికి పడలేదు. బిజినెస్ గదా! పైగా లాస్‌లో నడుస్తోంది'' అన్నాడు లావుపాటి వ్యక్తి.

[ఇంకా ఉంది]

# * సామాన్యుని సణుగుడు *

శీర్షాసనం వెయ్యడం వల్ల రక్తపు పోటు తగ్గిపోతుంది. గుండె జబ్బులు రావు — వృద్ధాప్యం దూరం జరిగిపోతుంది అని మహర్షులు, 'మోడరన్ యోగాసనా పండిట్స్' కూడా, అంటున్నారు. డా. 'ఉడుపా' గారనే గొప్పాయన ఒకరు వారణాశిలో మూషిక మహారాజుల్ని పెట్టి పరిశోధనలు ప్రారంభించాట్ట. ఎలకలకి మనుషులికీ జబ్బుల్లో చాలా పోలిక లున్నాయి. ఎలక్కి టి. బి. తెప్పించి దానికి చికిత్స చేస్తే ఆ మందు పనిచేస్తే దాన్ని మనుషులక్కూడా నిరభ్యంతరంగా యివ్వొచ్చునట! అంచేతనే ఎలకల్ని రోజుకో డజనుసార్లు శీర్షాసనం వేయించి వాటి తోకలకి ఎలక్ట్రిక్ పరికరాల కొలమానపు తీగ తగిలించి దాని బి. పి. హార్ట్‌బీట్ వగైరాలు 'హాపిగ్గా కొలుస్తున్నారు డాక్టర్లు. శీర్షాసనం వేస్తే మిగతా విషయాలెలావున్నా యీ ప్రపంచం తమాషాగా కనపడుతుంది ... చిన్నప్పుడు సముద్రపొడ్డున తల్లక్రిందులా చేతుల మీద నడిచేవాళ్ళం కుర్రాళ్లం. సముద్రం ఆకాశం వేపు, ఆకాశం సముద్రం వేపు తల్లక్రిందులయ్యాయిరోయ్ అని కేరింత లేసేవాళ్లం... "నీ పంట్లాం గుండీ(లోయ్' అని అరిచేవాడు ఓ కొంటె వెధవ. దాంతో దభీమని కాళ్ళమీద లేనడం ఫూల్ అయిపోవటం — అది సరే శీర్షాసనం ఎలకలచేత ఎట్లా వేయిస్తున్నారూ? ప్రయోగనాళికలో దాన్ని పెట్టి ఆ టెస్ట్ ట్యూబ్‌ని తల్లక్రిందులా పెట్టి, యీలోగా అందులోని వాతావరణాన్ని కలుషితంగాకుండా, ప్రాణవాయువు, 'తేమా' అన్ని చక్కగా అమర్చివేయిస్తున్నారు! మనుషులు శీర్షాసనం వేయాలీ అంటే సత్యంలకే చెల్లుతుంది. కాని సంసారులకెలా కుదురుతుందని — ఎక్కడ వేయాలి? ఎప్పుడు వేయాలి. తెల్లారకుండానే పాలబూత్‌లో వేసే నిరీక్షణాసనం — పంపులో నీళ్ళకోసం చేసే తపోనిష్టాసనం — బాయిలర్లలో వేసే రైలింజన్ రాక్షసిబొగ్గు పొగలోని కార్బన్ మొనాక్సైడ్ ముక్కుల్లో దూరకుండా ముక్కు మూసుకుని తెరచీ వేసే ఆసనమా? అది! ఆ అవస్థ అదీ...తెల్లారకుండానేఅన్ని దిక్కులనుంచి — తూర్పునుంచి వచ్చే ఎర్రని ఎండని త్రోసి రాజనే సినిమా పాటల రొదలో పంచదారకోసం, బియ్యంకోసం మధ్యాహ్నం కాఫీ డబ్బులకోసం వెతికే మస్తిష్కపు ఏ పొరలలో ప్రశాంతతని వెతికిపట్టి శీర్షాసనం వేయడం... మన పట్నాల్లో మురికి పేటలనేవి కొన్నే వుంటాయనుకోవద్దు — అన్ని పేటల్లో మురికి వుంటుంది, దుకాణాల్లోని తుక్కు వీధిలోకి విసిరేస్తుంటారు... టీ దుకాణాల నీళ్ల రోడ్లమీద పోసేస్తుంటారు...రోడ్డు అంటే అది పబ్లిక్ డస్ట్‌బిన్, పబ్లిక్ పాయఖానా— యింత కలుషిత వాతావరణంలో మనం శీర్షాసనం కాదుకదా, తల్లక్రిందులా దూలానికి వ్రేలాడినా ఎలకల్లా ఆ అదృష్టానికి నోచుకుంటామా? అన్ని ఎలకలూ అటకలమీదా, చూరుల మీదా, పుస్తకాల ర్యాకులలోను, బట్టల బుట్టలలోను అన్ని చోటలూ శీర్షాసనాలు వేస్తూనే వుంటాయి. అందుకే వాటి ఆయుర్దాయం ఎక్కువ; చురుకుతనం ఎక్కువ. తెలివితేటలూ ఎక్కువ... వీటని పట్టుకుందుకు మన శక్తియుక్తులు చాలటంలేదు... "ర్యాట్ రేస్" లో కొట్టుకు చావడమే మనవొంతు కానీ ఎలకల అదృష్టం మనకొస్తుందా? అయినా శీర్షాసనం మొదట గోడకి చేరబడి వేయటం మొదలెడితే ఎలాగుంటుందోనని ప్రారంభించబోతే— పొద్దున్నే వాళ్ళకి 'పాలురాలేదు' అని ఓ ఉగ్గు గిన్నెడు ఎరువు అడుగవొచ్చిన ఆవిడ స్నేహితురాలి మేనత్త కోడలు వో పద్దెనిమిదేళ్ల చిన్నది ఫక్కున్నవ్వేసి అలా బయటికి కాకుండా యిలా యింట్లోకి పారిపోయింది!... అయ్యో! క్యూలో నిలబడ్డానికి, బస్సులో వ్రేలాడ్డానికి తప్ప మనం శీర్షాసనాలకేం పనికొస్తామంటారూ?... శీర్షాసనం వేస్తే కాని ప్రశాంతంగా వుండదు మెదడూ. మెదడు శాంతంగావుంటేగాని శీర్షాసనంకుదర్దూ...!?

[వీరాజీ]

ఉన్నంతకాలమే నాకు రాజీ భయపడేది. కోపంలో కసిలో నేను మొదలుపెట్టిన ఆ పాడుపని నన్నాఖరికో హంతకుణ్ణి చేసింది. చివరికది ఆమె సంసారాన్నే ఛిన్నాభిన్నం చేసింది."

రవీంద్ర క్షణం ఆగి ప్రభాకరాన్ని పరీక్షగా చూశాడు. అతనిలో చలనంలేదు.

"ఒకనాడామెతో నేను ఘర్షణ పడుతూండగా ఎప్పుడూ ఆ వేళప్పుడు రాని ఆమె భర్త ఎందుకో ఇంటికి వచ్చాడు. హఠాత్తుగా అతన్నిచూసి భయంతో నేను పారిపోయాను. ఆతర్వాత జరిగినదంతా సింహావలోకనం చేసుకున్నాను. నా కళ్ళు తెరుచుకున్నాయి. నా మూలంగా ఆమె జీవితం నాశనమవటానికి సిద్ధంగా ఉందని గుర్తించాను. జరిగినదంతా అతనికిచెప్పి ఆమెను రక్షించాలని ఒకనాడు వాళ్ళింటికి వెళ్ళాను. అప్పటికే ఆలస్యమయిపోయింది. ఆ యింట్లో ఎవరూ కనిపించలేదు. చుట్టుపక్కల వాళ్ళనడిగితే జరిగిన ఘోరం వాళ్ళు చెప్పారు. భర్త ఆమె ననుమానించి ఇంట్లోంచి గెంటేశాట్ట. ఆ తర్వాత ఆమె ఎక్కడికి వెళ్ళిందో ఏమయిందో ఎవర్కీ తెలియదు. అతను చెప్పుపెట్టి ఎక్కడికో వెళ్ళిపోయాడు ... నామూలంగా ఒక సంసారం నాశనమైంది. ఒక నిండు ప్రాణం బలి అయిపోయింది! ఇదంతా వింటే ఎవ్వరయినా నన్ను క్షమిస్తారంటావా? ... ఒకవిధంగా నేను హంతకుణ్ణి అయినట్టు కాదూ!"

వెళ్ళిపోతూ తనవైపు చూస్తున్న ప్రభాకరానికి తనముఖం కనిపించకుండ కర్చీఫ్‌లో

# బ్లాక్ మెయిల్

(18వ పేజీ తరువాయి)

కప్పుకున్నాడు రవీంద్ర. ఓ నిమిషంపాటు ఆ గదిలో నిశ్శబ్దం తాండవించింది.

తిరిగి రవీంద్ర కంఠం సవరించుకున్నాడు. "మిమ్మలెవర్నీ నన్ను క్షమించమనటం లేదు. నాపాపం ఒకరు క్షమిస్తే క్షమయ్యేదికాదు. ఆ సంగతటు వదిలేయ్! ఇన్నాళ్ళకి నేను మరో తప్పుచేయటానికి సిద్ధంగాఉన్నాను. ఇదివరకు తెలిసే ఆ తప్పు చేసాను. కాని, ఈసారి జరిగిందేమిటో తెలియకుండ ఇంతకాలం గడిచిపోయింది. ఇప్పుడు తెలిసాక మరోక్షణంకూడ నేను ఉపేక్ష చేయదల్చుకోలేదు. నామూలంగా మరోరెండు జీవితాలు వ్యథలపాలవటం నేను భరించలేను...ఇప్పుడో మంచిపనిచేసే అవకాశం మీరు నాకివ్వాలి. ఇస్తావా ప్రభా!"

"మీరనేదేమిటో నా కర్థంకావటం లేదు" అన్నాడు ప్రభాకరం అయోమయంగా.

"నేనిప్పి మాటలు చెప్పనక్కర్లేదు. నీకంతా తెలుసు. నీకంతా తెల్సని నాకు తెల్సు. ఇందూ, నువ్వూ ప్రేమించుకున్నారు. పెళ్ళి చేసుకుందా మనుకున్నారు. కాని, ఎవరు కారణమయితేనేం నేనిలా మీ కడ్డువచ్చాను. ఇలా జరిగిందని నాకింతకాలం తెలియలేదు. ఇప్పుడు తెలిసాక నేనింక మీ దారినుంచి తప్పుకోవటం ధర్మం. నేనిప్పుడు కోరుకునేదొక్కటే! నా రాజీ కేమయిందో నీ ఇందూకి అలా కాకూడదు..."

"అలా అనకండి. ఇందులో ఇదివరదేం తప్పులేదు. నేనే నా స్వార్థం కొద్దీ ఇలా చేసాను. నన్ను క్షమించండి" అన్నాడు ప్రభాకరం. అతని ముఖంలో నిజాయితీ తొంగిచూసింది.

"ఎందుకు? క్షమించవల్సిన తప్పేం చేసావని? మనసయిన వాళ్ళని ప్రేమించటం నీ తప్పా! అది గుర్తించకపోవటం అయిన వాళ్ళతప్పు కాని. సరే, గతం గురించి వదిలెయ్. ఇప్పుడు జరగాల్సింది చూద్దాం. ఉద్యోగం లేదని సందేహించకు. పోషించలేనని కించపడకు. నీకుద్యోగం దొరికేవరకు నీ కండగా నేను నిలుస్తాను. ఇందూ ఎంత కుమిలిపోతోందో చూడు. ప్రేమలేని చోటుకన్న ప్రేమ ఉన్న చోటికి ఇందూని చేర్చే నా ప్రయత్నానికి సాయపడు. మీ సుఖాన్ని మించి నాకింకేం అక్కర్లేదు ప్రభా! ఇందూకి పెళ్ళయిందని బాధపడకు రేపే నేను విడాకులు ఇచ్చే ఏర్పాటు చేస్తాను. నా చేతులమీదుగా మీ ఇద్దర్కీ..."

"ఇక ఆపండి." అని అరిచాడు ప్రభాకరం.

"ప్రభా!...ఒక్కమంచి పనిచేసే అవకాశం నాకివ్వనా! నీ కన్నలాంటివాణ్ణి..."

"...ఆ మాట మీదే నిలబడండి. చేసిన తప్పు ఎటువంటిదయినా తమ్ముణ్ణంత ఘోరంగా శిక్షించరు కదా అన్నయ్యా!.. ప్రేమలేఖలు మేం వ్రాసుకున్న మాటనిజం. తెలిసీ తెలియని వయసులో పెళ్ళాముందూ చూసుకోకుండా ఆశలు పెంచుకున్నమాట నిజం! కాని, ఇందులో ఇందిరదేం తప్పులేదు. నామూలంగానే ఇంత జరిగింది. నేను తప్పు ఒప్పుకుంటున్నాను. నన్ను శిక్షించండి. మీ యిష్టం వచ్చినట్టు చెయ్యండి. కాని, ఆమెను మాత్రం బాధపెట్టకండి. ఆమె కేదయినా అయితే-నన్ను దేవుడుకూడ క్షమించడు' అంటూ తన చేతులతో ముఖాన్ని కప్పుకున్నాడు ప్రభాకరం.

రెండు నిమిషాలు గదిలో నిశ్శబ్దం రాజ్యమేలింది. రవీంద్ర ప్రభాకరం భుజంమీద చెయ్యివేసాడు. "నేనేమన్నా అనుకుంటానని సందేహించకు ప్రభా!...నువ్వు కావాలనుకుంటే..."

ప్రభాకరం తలెత్తి అతనివైపు చూసాడు. "...నేనిప్పుడు కావాలనుకునేది ఒక్కటే! ఇందూని...ఇందిరను మనస్ఫూర్తిగా మీరు స్వీకరించటమే! లేకపోతే, నేను ఘోర నరకం అనుభవిస్తాను."

"...నువ్వొత్త పిచ్చివాడివి. నీకింకా జీవిత



# ఏ పైరుకైనా
## సక్రమమైన పోషణకు–సమృద్ధియైన పంటలకు
# సుఫల 15:15:15 + యూరియా













మార్కెటింగ్ విభాగము–

**ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లి**

(కేంద్ర ప్రభుత్వ యాజమాన్య సంస్థ)

ఆంధ్ర ప్రదేశ్ రీజినల్ ఆఫీస్

5-10-173 ఫతేమైదాన్ రోడ్, హైదరాబాద్-500 004




kiron-FCI-1

మంటే ఏం తెల్సిందని!...వెళ్ళు. బాత్ రూమ్‌లో టవ్వా అదీ ఉంది. ముఖం కడుక్కోనిరా!' అని అరవన్ని రేవనెత్తినంత పని చేసాడు రవీంద్ర.

ప్రభాకరం అటు వెళ్ళాక ఇందిర దగ్గఱకి వచ్చాడు రవీంద్ర. ఆమె ఒంటిమీద చెయ్యి వేసాడు. ఆమె చటుక్కున పైకిలేచి కూర్చుంది. అతనిక్కనిపించకుండా తనముఖం త్రిప్పుకుంది.

"కొంచెం కాఫీ తాగుతావా ఇందూ!" అని ఫ్లాస్కు తీసుకువచ్చాడు రవీంద్ర.

తల అడ్డంగా త్రిప్పింది కాని అతనివైపు చూడలేదామె.

ప్రభాకరం బాత్‌రూమ్‌నుంచి తిరిగి వచ్చాడు.

"నువ్వు కూడ ముఖం కడుక్కోనిరా ఇందూ!" అన్నాడు రవీంద్ర.

ఇందిరలో కదలికలేదు.

"నేను వెళ్ళొస్తానండి." అన్నాడు ప్రభాకరం నేల చూపులు చూస్తూ.

"అలాగే వెళ్ళిరా! కాని, రేపోసారి కాలేజీకి వచ్చి కనిపించు. 'ఫిజిక్స్‌లేబ్'లో ఏవో వేకెన్సీ లున్నాయని 'హేండ్స్' కావాలని ప్రిన్సిపాల్ అంటుంటే విన్నాను అందాకా కాలక్షేపాని కయినా నువ్వందులో చేరచ్చు. ఆపైన మంచి పోస్టు దొరికితే మానెయ్యొచ్చు .."

ప్రభాకరం కళ్ళు అశ్రుపూరితాల య్యాయి, "నాకు మీ మంచితనం అందుకునే అర్హతుందంటారా?"

"కాని, నీఅంత మంచివాడిని మాత్రం కాదు నేను. ఒక్కనిజం చెప్పటానికి వంద మాటలు వెతుక్కున్నాను నేను నువ్వు నాల్గు మాటల్లో నీ మనస్సు విప్పి చెప్పావ్! నీకంటె మంచి మనిషెక్కడుంటాడు!...రేపు కాలేజీకి రా! ఐ ప్రామిస్ టు హెల్ప్ యూ!"

"మెనీ థేంక్స్!"

"నెవర్ మైండ్! విష్ యు గుడ్ లక్!"

ప్రభాకరం బయటకు వెళ్ళిపోబోయి మళ్ళీ వెనక్కి వచ్చాడు చటుక్కున జేబులోంచి ఉత్తరాలకట్ట తీసి. ఇందిరముందు టీపాయ్‌మీద పెట్టి చకచక నడుచుకుంటూ బయటకు వెళ్ళిపోయాడు.

రవీంద్ర తలుపులువేసి వచ్చాడు. ఆ ఉత్తరాలకట్ట చేత్తో పట్టుకొని ఆమె ప్రక్కనే సోఫాలో కూర్చున్నాడు.

"అబ్బ, ఎన్ని ఉత్తరాలు వ్రాశావు ఇందూ ఇటువంటి ప్రేమలేఖలు నీనుంచి అందుకునే అదృష్టం నాకు లేకపోయింది కదా!"

ఆమెలో చలనం లేదు.

"పోనీలే! ఎప్పుడయినా ఒక్కసారి నన్ను చదువుకోనిస్తావా ? ... పైన 'ప్రభా' అని రాసి వుంటావేమో! 'రవీ' అని నాను కొని చదువు కుంటానులే." అని నవ్వుతూ ఆమె వెన్నుమీద చెయ్యి వేశాడు.

ఆమె గజగజ వణికి పోతోంది. చటుక్కున ఆ ఉత్తరాలకట్ట పక్కన పడవేసి ఆమె చుట్టూ చేతులువేసి తనవైపు తిప్పుకున్నాడు. "...ఎందుకిలా భయపడుతున్నావ్! నిన్నేదో చేసేస్తాననే! ఛ! అంత కిరాతకుణ్ణనుకున్నావా?" అంటూ ఆమె చుబుకం పట్టుకొని పైకెత్తాడు.

ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి బుగ్గలు తడిసి ఆమె హృదయ విదారకంగా వుంది. పెదవులు ఏదో చెప్పబోయి చెప్పలేనట్టు కంపిస్తున్నాయి.

"అబ్బ, ఎంత దెబ్బకొట్టాను! హఠాత్తుగా నన్నుచూసి నువ్వలా 'హిస్టీరికల్'గా కనిపించేసరికి కంగారుపడి అంతలా కొట్టాను. నిజం ఇందూ! నీమీద కోపంచేత నేనలా చేయలేదు. నన్ను నమ్మ" అంటూ ఆమె బుగ్గ నిమిరాడు రవీంద్ర.

అతనివైపు తేరిపార చూసింది ఇందిర.

"నన్ను క్షమించు ఇందూ!" అన్నాడతను ఆమె చేతులు పట్టుకుంటూ.

"లేదు. మీ రిలాంటి మాటలింక మాట్లాడకండి నా పాపం పెంచి పెద్దది చెయ్యకండి. నేను మీకు చేసిన ద్రోహానికి నాకొక్క దెబ్బ చాలదు. ఎన్ని దెబ్బలు కొట్టినా నా పాపం పోదు. నన్ను క్షమించకండి నన్ను ప్రేమించకండి. అలాంటి చల్లని మాటలింకేవీ చెప్పకండి. నేనవి భరించలేను ఈ పాపభారం మోయలేను. అంతకన్న మీరు కొరత వేయించినా నాకు బాధుండదు..."

"...అబ్బబ్బ! ఏమిటీ ఆవేశం ఇందూ! ఇప్పుడేమయిందని? నువ్వెందుకింత బాధపడాలి? నేనేమయినా ఆకాశం నుంచి దిగివచ్చానా? నేను మాత్రం పాపం చేయలేదూ? రాజీ జీవితం నాశనం చేయలేదూ? నేను చేసిన తప్పుల్ని మాత్రం ఎవరు క్షమిస్తారు? ఇన్నాళ్ళు ఈనిజం దాచి నిన్ను మోసంచేశాను. ఇప్పుడు సమయం వచ్చింది కనుక బయట పడ్డాను. లేకపోతే..."

ఒక్క క్షణంపాటు అతని కళ్ళలోకి సూటిగా చూసింది ఇందిర "ఏమండీ! మీరు చేయని పాపం పెంచుకుంటే నేను చేసినతప్పు తగ్గుతుందనుకుంటున్నారా !"

"నిజం ఇందూ! నేను చెప్పింది నిజం!" అన్నాడు రవీంద్ర తలదించుకొని ఆమె చేతి వేళ్ళను నిమురుతూ.

"ఒక అబద్ధం మీ చుట్టూ అల్లుకుంటే కాని...నా చుట్టూ ఉన్న నిజాన్ని నేను గ్రహించ లేననుకుంటున్నారా? చూడండి నేను అల్పురాల్ని. మీ ప్రేమకి, అభిమానానికి...కనీసం జాలికూడా అనర్హురాల్ని. ఇటువంటి దాని కోసం ఎందుకలాంటి కల్పన చేసారు ? మిమ్మల్ని మీరే ఎందుకలా చిన్నబుచ్చుకున్నారు? ... మీ దెబ్బల్నయినా భరించగలనేమో కాని మీ మంచితనాన్ని భరించలేనండీ!...నేను మీ అభిమానానికి తగనండీ!" అంటూ ఏడువ సాగింది ఇందిర.

ఆమె చుట్టు చేతులువేసి పొదివి పట్టుకున్నాడు రవీంద్ర. "ఎంత పిచ్చిదానివి

## పాల మీగడతో సుగియలు

కావలసిన వస్తువులు :— పాల మీగడ 1 కప్పు, మైదా 150 గ్రా., గోదుమపిండి 1 గ్లాసు, చిటికెడు సోడా, కొన్ని కలకండ ముక్కలు, డాల్డా తగినంత.

చేయవలసిన విధానము :— మైదా జల్లించి ఒక పళ్ళెంలో పోసుకుని కొద్దిగా కాచిన డాల్డా, మీగడ, సోడా పిసరు వేసి కలపాలి. ఒక గంట నానాక బాగా మర్దించాలి. మైదాని చిన్న చిన్న వుండలుగా చేసుకుని ప్రతి ఉండకు మధ్య కలకండను పెట్టి ఉండలు చెయ్యాలి. ఈ మాదిరిగా అన్నీ తయారుచేసుకున్న తరువాత గోధుమ పిండి జల్లించి బజ్జీల పిండికన్నా కొద్ది పలుచగా కలుపుకొని ఈ సోవిలో మైదా వుండలు ముంచి డాల్డాలో వేయించుకోవాలి. ఇవి గోధుమ రంగులో వేగాక ఒక గిన్నెలోకి తీసుకోవాలి. మైదా వుండలో వుండే కలకండ డాల్డాలో వేగేటప్పుడు కరిగి తేనెలా పాకం పూరి లోపల వుంటుంది. పైకి ఏమీ కనబడదు. తింటుంటే దాని రుచి తెలుస్తుంది!

— వల్లిశ్రీ నాగరాజు

## బ్లాక్ మెయిల్

ఇందూ!...రాజీ పాత్ర కల్పించానని ఎలాగను కున్నావ్?"

చటుక్కున తల యెత్తింది ఇందిర. "అయితే చెప్పండి. రాజీ ఎవరు?"

"అదే మన పెళ్ళికి-బొద్దుగా, చక్రాల్లాంటి కళ్ళతో ఉన్న పాపాయి నెత్తుకొని-రాలేదూ ఒకావిడ! ఆమే రాజ్యలక్ష్మి. నేనూ రాజీ అనేవాణ్ణి. ఓసారి ఆమెకో ప్రేమలేఖ వ్రాసాను. అదేలే-ఆమెకి పెళ్ళికాకముందు-కాలేజీలో చదువుకునే రోజుల్లో." అని నవ్వాడు రవీంద్ర.

ఇందిర కళ్ళప్పగించి చూస్తోందతన్ని

"అప్పుడేం చేసిందనుకున్నావ్! నన్నొంటరిగా పిల్చింది. ఇంకేముంది-నా రొట్టె విరిగి నేతిలో పడిందనుకున్నాను. నా పంట పండిందనుకున్నాను. కాని తీరా వెళ్ళాక కథ అడ్డం తిరిగింది ఈ లవ్‌లెటర్ ప్రిన్సిపాల్‌కి చూపించి డిబార్ చేయించమంటావా-లేక మీ నాన్నగార్కి చూపించి పెళ్ళి చేసుకోమంటావా-అని అడిగింది." అని పకపక నవ్వాడు రవీంద్ర.

ఇందిరకూడ నవ్వకుండ ఉండలేకపోయింది.

"నేతి గారెలు తిందామని వెళ్ళినవాడికి జెల్లకాజాలు తినిపించింది రాజీ. రారెత్తిపోయాను. మళ్ళీ ప్రేమ పేరెత్తితే ఒట్టు." చేరుమాలుతో నవ్వు తెప్పించిన కన్నీళ్ళొత్తుకుంటూ అన్నాడు రవీంద్ర.

ఇందిర ముఖంలో బేలతనం చూసి "పిచ్చి ఇందూ! ఎందుకంత బాధపడతావ్! వయస్సులో ఉన్నవాళ్ళు కాపోతే ముసలివాళ్ళు రాసుకుంటారా ప్రేమలేఖలు!" అన్నాడు ఆమెను బుజ్జగిస్తూ.

"మీరుకాక మీ స్థలంలో ఇంకెవరయినా ఉండుంటే నా బ్రతుకు ఎలా తెల్లవారేదో!"

"పిచ్చి ఊహలు ... పిచ్చిమాటలు కట్టిపెట్టు. నువ్వనుకున్నంత మంచివాణ్ణేంకాదు నేను. ఇందాకా ప్రభాకరంకి చెప్పిన కథ కల్పన కాని...నేను మీమీద గూఢచారి పనిచేసినమాట మాత్రం నిజం!"

ఇందిర వెలవెలబోతూ చూసింది.

"అవును. సైకాలజీ నా సబ్జక్ట్ అయినందుకు నా ప్రజ్ఞంతా నీమీదే ప్రయోగించాను...రెండు మూడు నెలలుగా నీలో ఇదివరకటి ఉత్సాహం లేదు. సరదా మాటలు లేవు. బొత్తిగా చిక్కిపోయావు. ఎప్పుడూ ఏదో పరధ్యాన్నం. పేటికోసారి ఇంట్లో డబ్బు లేదా పటం యథాలాపంగా అడిగినందుకే నీ మాటల్లో బెదురు. ఏదో దాస్తున్నట్లు కంగారు. హఠాత్తుగా నీలో ఈ మార్పెలా వచ్చింది? అదే తెల్సుకుందామని 'వాచ్' చెయ్యటం ప్రారంభించాను. అప్పుడే ఒక రోజు ప్రభాకరం మన ఇంటికి వచ్చివెళ్లటం కనిపెట్టాను. ఆతర్వాత అతనెవరయిందీ, ఎక్కడుండేదీ అన్ని వివరాలు సేకరించాను. దాంతో కథంతా అర్థమయింది. అతను ప్రతి సోమవారం నీదగ్గరికి వస్తున్నాడు అది తేల్చుకుందామనే క్రితం వారం తలనొప్పని వంకపెట్టి నేనింట్లోనే ఉండిపోయాను. సరిగ్గా అతనొచ్చే సమయానికి నువ్వు పక్కింటికి వెళ్ళావు. తలుపు తీసే సరికి నన్ను చూసి ఏదో పొరపాటున మన యింటికి వచ్చానంటూ గబగబా వెళ్ళిపోయాడు ప్రభాకరం. అతనేవేళ వస్తాడని నాకు తెల్సు. నేనూహించినట్లు ఈసారి కాలేజీకి వచ్చి నేను వచ్చానో లేదో చూసి మరీ వచ్చాడు. ఆ తర్వాత అతను ముందు... నేను వెనక ఇంటికి వచ్చాం. బయటనుంచి నీ మాటలన్నీ విన్నాను. నీమనస్సంతా చదివాను. ఈ కథ ఓ కొలిక్కి వచ్చింది. ఇప్పుడు చెప్పు నేను చేసినపనికి క్షమిస్తావా!"

"మీరే ఆపని చేయకపోతే... ఏదో ఒక రోజున మీ కథలో రాజీకి ఏమయిందో నాకూ అదే గతి పట్టుండేది"

"యూ సిల్లీ! స్టాప్ క్రయింగ్!" అంటూ ఆమె బుగ్గలు దోసిట పట్టాడు రవీంద్ర.

ఆమె ఆరాధనగా అతని కళ్లల్లోకి చూసింది. "ఈవేళ నా కాలేజీకి ఎలాగా 'డుమ్మా' కొట్టేశారుగా! అలా సరదాగా సినిమాకయినా పోదాం పద"

చీర చెంగుకు కన్నీళ్లొత్తుకుంటూ, "...సినిమాకి వద్దు. వెంకటేశ్వరస్వామి గుడికి వెడదాం." అంది ఆమె.

"ఎందుకు ? మొక్కుకున్నావా!"

ఊఁ- అన్నట్లు తలపంకించింది.

"ఏమని? - నన్నే మరో జన్మకూడా భర్తగా ఇమ్మని అవునా?" అని నవ్వాడతను.

"కాదు. మరో పది జన్మలదాకా..."

"సతీసావిత్రీ! వచ్చే జన్మలోనయినా నాకింత చక్కని లవ్ లెటర్స్ వ్రాస్తావా! ప్రామిస్!"

కందిన ఆమె బుగ్గలమీద అతని పెదవులు ఒత్తొత్తి ముద్రలు వేసాయి

# ప్రపంచము యొక్క ప్రప్రథమ డెటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777



**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో**




సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరిక్రొత్తది! ఇది క్రొత్త ఫార్ములా. దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ తెల్లగా, ఎక్కువ శుభ్రముగా ఉతికే సామర్థ్యము ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడ! దీని ధర మామూలు బార్ సబ్బుల కంటె తక్కువ కూడ!

**ఒక క్రొత్త రకపు ఉతికే బార్‌ను వాడటము ప్రారంభించండి—సూపర్ 777 డెటర్జెంట్ ఉతికే బార్!**

shilpi hpma 6A/73 TEL

కె. సి ఎస్. ఏ. విస్సన్నపేట

శ్రీశ్రీపై మీ అభిప్రాయం?

మహా ప్రభంజనంలా కవిత్వం,
మైనంముద్దలా మనస్సు!



పి. ఆర్. ఎన్. రామరాజుపల్లి

కృషితో నాస్తి దుర్భిక్షం అన్నారు కదా, ఎంత కృషి చేసినా శాయశక్తులా ప్రయత్నించినా అనుకొన్న కానియందు విజయం లభించకపోయిన, దానికేం కారణం?

ప్రయత్న లోపమే— విజయం మీదున్న ఆత్రుత మమకారం— కృషిలో కూడా ఉండాలికద.

డి. ఏ ఆర్. ఏలూరు

నాకు ఆడవాళ్లంటే గౌరవము ఉన్నది. కాని మీలాంటి పొగరుబోతులవలన నాకున్న గౌరవం పాడుచేస్తున్నారు.

తీతువపిట్ట కాళ్లు ఆకాశానికి పెట్టి నిద్ర పోతుందట— ఆకాశం విరిగి మీదపడకుండా అలా ఉంది, మీ గౌరవ పదం. ఒక్క పొగరు బోతుఆడది కనిపిస్తేనే, ఆ జాతి మీద గౌరవం పోతే, అది నిజమైన గౌరవం ఎలా అవుతుంది!!

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

ఎస్. వి. పాలచర్ల

సంసారం ఒక సాగరం అని తెలిసికూడా మరి మనిషి పెళ్లి చేసుకుని సంసార సాగరంలోనికి దూకడం ఎందుకు?

ఛాలెంజిని ఎదుర్కొనాలనిపించడమేకదా— మానవ బలహీనత!!

జి. ఎస్. పి. ఆర్. గుంటూరు

సిరా లేని కలం, ప్రేమ లేని హృదయం, తాడు లేని బొంగరం, దేవుడులేనిగుడి, హృదయంలేని మనిషి, మనసులుకలయని జంట ఎలాఉంటాయి?

అలాగే ఉంటాయి!— లేకపోతే ఏమిటి? కలానికి సిరా దొరకదా? బొంగరానికి జాటీ దొరకదా?

వి. ఆర్ హైదరాబాదు

చచ్చాకెందుకు సమాధివిూద ఖర్చుపెడతారు ?

బంగారం పొదిగినా సమాధిని పురుగులు ఆక్రమించుకోక మానవన్న చిన్ని సత్యం మరిచి.

పి. వి. ౦ర్ దుర్మేదు

కట్నం లేకుండా పెళ్లి చేసుకుంటే చులకనగా చూస్తారు. కట్నం తీసుకు చేసుకుంటే— ఈసడింపుగా చూస్తారు. ఛీఛీ— విూ ఆడ జాతికిదేం బుద్ధి.?.

ఇంతకీ అలా చూసేదెవరు? విూరుకదూ ఒచ్చే మనిషి కట్నం తేకపోతే, ఎంతో తెచ్చినా, అంతేకద— ఆమెగారికేం ఒరగపెడుతున్నారు? ఎక్కువ కట్నం తెచ్చినా— కట్నం తేకపోయినా— ఆడది వస్తే, కోడలుగా, కొత్త పనిమనిషి వచ్చినట్టే లెక్క కద!

కె. వి. వి. ఎస్ సిహెచ్ ఆర్. ములగపూడి

విూ సమాధానాలు చాలావరకు పెడసరంగాఉంటున్నాయి. ఏమాత్రం విజ్ఞానదాయకంగా ఉండడం

---

ప్రవేశపెడుతున్నాము!




యూరంపాస్ 28:28:0 'ఆదర్శమైన రసాయనిక ఎరువు' మీ జువారి డీలరువద్ద దొరుకుతుంది.

- ఇది అన్ని పైరులకు తగిన శక్తివంతమైన కాంప్లెక్స్ రసాయనిక ఎరువు.
- దీనిలో మొక్క పెరుగుదలకు కావలసిన కీలక పోషక పదార్థములు 56 శాతం ఉంది. అంటే 28 శాతం నత్రజని—మొక్క ఏపుగా పెరగటానికి, మరియు 28 శాతం భాస్వరము—పూర్తిగా కరుగు రూపంలో—వేళ్ళ పెరుగుదలకూ, బాగా గింజ కట్టడానికి.
- సమానమగు ఒకే రకమైన గుళికల వలన పోషక పదార్థములను పొలం అంతటా సమంగా వేయుటకు వీలౌతుంది.
- గుర్తుంచుకోండి! జైకిసాన్ రసాయనిక ఎరువులు తేలిక పసుపు రంగు వేసిన జైకిసాన్ గుర్తుగల దుకాణంలో దొరుకును.

యూరంఫాస్ 28:28:0 అధిక దిగుబడికోసం, పుష్కలమైన లాభాల కోసం

| |
|---|
| సరిసమానమైన పోషణ ఎక్కువగా కావలసినప్పుడు, మేము సిఫార్సు చేసేది: జైకిసాన్ సంపూర్ణ 19:19:19 ఎన్‌పికె సంపూర్ణ రసాయనిక ఎరువు |



ఇప్పుడే కొనండి!
పుష్కలంగా లాభాలను పొందండి!




**జువారి అగ్రోకెమికల్స్ లిమిటెడ్, గోవా.**

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు:
బెంగుళూరు, హుబ్లి, కర్నూలు, నాగపూర్, పూనా, సికింద్రాబాదు.

లింటాస్-ZUA. 37A-140 TL (R).




గబగబా వెళ్ళి సూట్‌కేస్‌లోనుండి ఒక ఆల్బమ్ తీసికొచ్చి అతని చేతికిచ్చాను.

"ఏమిటిది?" అడుగుతూనే పేజీలు తిప్పిన రవి ఒక్కసారిగా కళ్ళు చికిలించి.

"మై గాడ్! మాల ఆల్బం కదూ ఇది!" అడిగాడు వింతగా

"అవును. అందులో మీ ఇద్దరి ఫోటోలూ నెగెటివ్‌లూ తీసేసుకోండి. చివర్లో మీ రామెకి వ్రాసిన ఉత్తరాలు కూడా ఉన్నాయి." ధీమాగా అన్నాను.

రవి వేను చెప్పినట్టే చేసి, లప్పిటిని చింపేసి బయట పారేసాడు.

"ప్చ! అలా చేసారేం?" చిత్రంగా అడిగాను.

'ఇంకా అవెందుకు, ఆమెతో స్నేహమే త్రుంచుకోబోతూంటే! ఇంతకీ ఇవన్నీ ఎలా సాధించావో చెప్పూ సస్పెన్స్‌తో చంపక"

అతను బ్రతిమాలుకుంటూంటే జాలిపడి, "అదంతా చాలా చిత్రంగా జరిగింది లెండి. నాలుగు రోజుల క్రితం మా స్నేహితురాలు వసూ ఈ ఊరికొచ్చిందని తెలిసి వాళ్ళ పిన్నమ్మగారింటి కెళ్ళాను మాటల సందర్భంలో మాల వాళ్ళింట్లోనే పేయింగ్ గెస్ట్‌గా ఉంటోందని తెలిసింది. నా అదృష్టవశాత్తూ కిందరోజే వాళ్ళమ్మగారికి ఒంట్లో బాగాలేదని టెలిగ్రాం వస్తే మాల చిత్తూరి కెళ్ళిందట.

"అదేమిటే సుజా! మాల నీకు తెలుసా! ఓహ్ అందుకే కాబోలు నిన్న నీకు ఉత్తరం వ్రాస్తోంది' సుజాత కేరాఫ్ మాధవరావుగారు' అని వ్రాస్తున్నప్పుడు అనుమానం వచ్చింది నీకేనేమోనని. బెజవాడ వెళ్ళాక ఉత్తరం వ్రాయమని ఆయన అడ్రస్ ఇచ్చావుగ నాకు? అందుకే గుర్తుపట్టాను. అయినా ఊళ్ళో ఉన్న మీకి ఉత్తరమేమిటా అని అనుమానం కూడా వచ్చింది. అడుగుదామనుకుంటూనే ఉన్నాను. ఇంతలోకి ఆమెకి టెలిగ్రాం రావటం మరో అరగంటలో బస్సుందని ఆమె కంగారుగా వెళ్ళిపోవటం జరిగింది" అన్నది వసుంధర.

"ఇంతకీ ఆ కవరు పోస్టు చేసిందా?" ఆతృతంగా అడిగాను.

"ఏమో తెలీదు. ప్రక్క రూమేగా చూద్దాం పద" అంటూ మాల గదిలోకి తీసుకెళ్ళింది.

టేబిల్ డ్రాయర్లో ఉత్తరం దొరికింది. అదే ఆ రోజు మీకు చూపించాను చూడండి.

*(గత సంచిక తరువాయి)*

అదే ఉత్తరం! అది చదివాక రెండ్రోజులుగా మీ రెండుకలా ఉంటున్నారో అర్థమైంది వసుంధరకి మాల గురించంతా చెప్పాను.

"అదేమిటి? వాళ వాళ్ళు మా ఆంటికి బాగా తెలుసట. పోయినసారి వచ్చినప్పుడు వాళ్ళన్నయ్య మాల గోపాల్ అని తన ఫ్రెండ్‌నే ప్రేమించిందనీ, ఇద్దరూ తొందరపడటం జరిగిందనీ, త్వరగా పెళ్ళి చేయాలనుకుంటున్నాననీ చెప్పాడట. ఇంతలోకే మాల ఇలా ప్రవర్తించటమేమిటి?" అన్నదది అసహ్యంగా.

"పిచ్చిమొహమా! అంతా డబ్బులోనే ఉందే!" అంటూ దాన్తోసహా మాల అలమారలు వెతికి మీ ఉత్తరాలూ, ఆల్బం పట్టుకొచ్చేసాను" నవ్వుతూ చెప్పాను. అంతదాకా అయోమయంగా వింటున్న రవి, "మరిన్ని రోజులూ నాకు చెప్పలేదేం?" అన్నాడు చిరుకోపంగా.

"మిమ్మల్ని కొన్ని రోజులపాటూ బాధ పడనిద్దామని!" కొంటెగా అన్నాను.

"ఎంత అసాధ్యురాలివి? ఇంతకీ ఇది నీరజకి తెలుసా?"

"తెలుసు."

"అంటే ఇద్దరూ కలిసి నన్ను ఫూల్‌ని చేసారన్నమాట! పోన్లే! మొత్తానికి సమస్య పరిష్కారమైందిగా!" సగం ఉడుక్కుంటూ సగం తృప్తిగా అన్నాడతను.

---

*జరిగినకథ 5:* తండ్రి చిన్ననాటి స్నేహితుడైన మాధవరావుగారి ఆఫీసులో వుద్యోగం సంపాదిస్తుంది సుజాత. కొడుకు రవికి మేనకోడలు నీరజనిచ్చి పెళ్ళి చేయాలనుకుంటారు మాధవరావుగారు. రవీ మాలల పరిచయం నీరజకు ఇష్టం వుండదు. రవీ నీరజల మధ్య అభిప్రాయభేదాలు పెరుగుతాయి. నీరజ, జయరాం తనని పెళ్ళి చేసుకుంటానని కోరినట్లు రవితో చెప్తుంది. రవి, మాలను చేసుకోబోతున్నట్లు సుజాతకు చెప్తాడు. జయరాంని పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంటుంది నీరజ. తనని పెళ్ళి చేసుకోటానికి సుజాతను ఒప్పిస్తాడు రవి. రవీ సుజాతలను బెదిరిస్తుంది మాల.

---

"అలా అంటే సరిపోదు. ఇకముందు ఇలాటి స్నేహాలు చెయ్యననీ, సమస్యలు తెచ్చుకోననీ ఒట్టు వెయ్యండి" చెయ్యి ముందుకి జాపాను.

"ఒట్టు" చేతిలో చెయ్యి వేసాడు రవి. "అయితే ఒప్పుకున్నట్లేగా పెళ్ళికి?"

"ఆ!"

"నాన్నగారితో చెప్పనా?"

"అలాగే!"

"బాగా ఆలోచించుకున్నావా లేక మరోసారి..."

"అవసరంలేదు" ఖచ్చితంగా అన్నాను.

"అయితే సరె! విష్ యూ స్వీట్ డ్రీమ్స్. బై ది బై. థాంక్యూ ఫర్ యువర్ కైండ్ హెల్ప్" ఆప్యాయంగా చెయ్యి నొక్కి వెళ్ళిపోయాడు రవి.

* * *

నవంబరు 22, ఆదివారం 1974

ప్రొద్దున్న పది గంటలకిగానీ పని తెమల్లేదు.

సరిగ్గా నెలరోజుల క్రితందాకా తీరిగా కూర్చునేదాన్ని.

ఇప్పుడో! ఇల్లాలిగా క్రొత్త బాధ్యతల్ని స్వీకరించవలసి వచ్చింది! అయినా అందులో ఎంత ఆనందం ఉంది?!

అసలు రవితో నా వివాహం ఎంత యాదృచ్ఛికంగా జరిగిపోయిందో తలుచుకుంటే నాకే ఆశ్చర్యంగా ఉంది. మాధవరావుగారు స్వయంగా నన్ను కోడలిగా చేసుకుంటామన్నప్పుడు అమ్మా, నాన్నా ఎంత సంతోషపడ్డారని!

"నేనప్పుడే చెప్పలేదూ మన సుజాతకి రవితో పెళ్ళి జరిగి తీరుతుందని!" వేణన్నయ్య ఆనందం. నా పెళ్ళి జరుగుతోందనే సంతోషంకన్నా వాడి జోస్యం నిజమైందన్న ఆనందం ఎక్కువగా కనిపించింది వాడిలో.

## గెలుపు నాదే

"నా సంపాదన నీకు రాసిపెట్టి లేదే సుజా! సరిగ్గా నేను ఉద్యోగంలో చేరేనాటికి నీ పెళ్ళయిపోతోంది." అన్నాడు వాసన్నయ్య. వాడికి వరంగల్‌లో లెక్చరరుగా పోస్టింగయింది.

"ఏం పెళ్ళయితే నిన్నొదులుకొంటాననుకున్నావా? అదేం లాభంలేదు మొదట్నెల జీతంతో నాకో పట్టుచీర కొనాల్సిందే." అన్నాను నవ్వుతూ. అందరం సరదాగా నవ్వుకున్నాం.

పెళ్ళయ్యాక రవి ఏస్టేటు వ్యవహారాల్లోనూ, కంపెనీ అభివృద్ధిలోనూ చాలా శ్రద్ధ చూపుతున్నాడు. అది చూసిన మాధవరావుగారి సంతోషం అంతా ఇంతా కాదు.

నీరజ పెళ్ళి నా పెళ్ళికి వారం రోజుల ముందే జరగటంతో పెళ్ళికి రాలేదు. శుభాకాంక్షలు తెలుపుతూ ఇద్దరం ఉత్తరాలు వ్రాసుకున్నాం. నీరజ ఉత్తరంలోని సారాంశం నాకింకా బాగా గుర్తుంది.

"సుజా!

నిన్నెలా అభినందించాలో తెలీటంలేదు. రవిని ఎందరో అమ్మాయిలు తమ వైపు త్రిప్పుకోవాలని ప్రయత్నించి ఓడిపోయారు. కానీ అది నీకు సాధ్యమైంది. దానికి కారణం నాకు తెలుసు. ఎన్నో వీనులవిందైన స్వరాలున్నా ఒక్క నాగస్వరం మాత్రమే నాగరాజునెందుకు ఆకర్షిస్తుందంటావు?! దానికి సమాధానం లేదు. అంతేకాదు. లతన్ని బాధ్యతలు తెలుసుకోగలిగిన పరిపూర్ణ పురుషుడిగా తయారు చేసావంటే ... సింప్లీ ఐ అప్రిషియేట్ యూ. నిన్ను అభినందించకుండా ఉండలేకపోతున్నాను. రవిని నువ్వు గెల్చుకున్నావు. అంతేకాదు. అతన్లో మార్పు కూడా తేగలిగావు. గెలుపు నీదే! నువ్వు కలకాలం సుఖంగా ఉండాలని ఆకాంక్షిస్తూ.

నీ

నీరజ."

వ్రాస్తున్నడైరీ మూసేసాను. డైరీలో పేజీలు అయిపోయాయి. చిత్రం! సరిగ్గా నేను ఉద్యోగానికని ఈ ఇంటికొచ్చినప్పుడు కొన్నానా డైరీ, నా వివాహంతో ముగిసింది. జీవితంలో ఓ ఘట్టం సంతోషంగా ముగిసింది. త్వరలో రాబోయే రవి పుట్టినరోజుకి ఇది బహుమతిగా ఇవ్వాలి. నా కథలు చదవటానికే అంత ఉబలాటపడిన రవి నా జీవిత కథ పొంగిపోతూ చదవడూ?! అంతకంటె నాక్కావలసింది మాత్రం ఏముంది?! అనుకుంటూ తన్మయంగా డైరీని హృదయానికి హత్తుకున్నాను. (అయిపోయింది)

# పరిష్కారం

గోకుల రవీంద్రనాథ్

శ్రీమతి కుదుపుతో మెలుకువ వచ్చింది.

"లేవండి త్వరగా! బండి రైటు టైముకు ఉంటే ఈపాటికి నెల్లూరులో వుండేవాళ్లం" అంటోంది. బద్ధకంగా ఆవలించి టైమ్ చూశాను. ఆరయింది. షట్టర్స్ పైకెత్తి విండో గుండా చూశాను. చలికాలం కావడం మూలాన మంచు యింకా పూర్తిగా విడివడ లేదు. అప్పుడే పైకి వస్తున్న సూర్యుడు తన వేడి కిరణాలతో పొగమంచును కరగించాలని చూస్తున్నాడు. "కావలి" దాటింది హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్. ఎదురు బెర్త్ మీద మీద చూశాను. పాప, బాబు ఇంకా నిద్ర పోతున్నారు. ఆ సరికే అందంగా తయారయి ఉన్న శ్రీమతిని చూడగానే నాలో చిలిపి కోరిక తలెత్తింది. గబుక్కున దగ్గరకు తీసుకున్నాను. శ్రీమతి మూతి 'సున్నా'లా చుట్టి "ఏమిటీ సరసాలు పాచిముఖంతోనే" అంది కాస్త కోపంగా. నాకు తెలుసు. శ్రీమతి కోపం దీపావళినాటి చిచ్చుబుడ్డితో సమానం. "లేవండి! ఇంకో గంటలో నెల్లూరొచ్చేస్తుంది" మరోసారి జ్ఞప్తి చేసింది. "ఏమిటో, అప్పుడే నెల్లూరొచ్చేస్తుందంటే బాధగా వుంది. ఫస్ట్‌క్లాసు-'కూపే' లో ప్రయాణం-బయట మనుషులతో సంబంధం లేకుండా పిల్లలతో, శ్రీమతితో ఒంటరిగా... భగవాన్! చాలు నాకీ జీవితం" అనుకున్నాను మొదటిసారిగా. కాని నా స్వగ్రామమయిన నెల్లూరుకే నేను స్టేషన్ మాష్టరుగా వెళ్తున్నానంటే ఆ ఆనందం, అనుభూతి మాటలకందనిది.

బ్రష్ మీద పేస్టు వేసి నోటికందించింది శ్రీమతి. టవల్ భుజాన వేసుకొని, సోపుతీసుకొని టాయిలెట్ వైపు నడిచాను. నేను తిరిగి వచ్చేసరికి పిల్లలు కూడా నిద్రలేచి ఉన్నారు. ఇద్దరికీ ఫ్లాస్కులోని హార్లిక్స్ ఒంపి ఇస్తోంది శ్రీమతి. నన్ను చూడగానే "గుడ్ మార్నింగ్ డాడీ!" అంది పాప. "గుడ్ మార్నింగ్ పాపా" అని "గుడ్ మార్నింగ్ టు యూ ఆల్సో బాబూ!" అన్నాను. "గుడ్ మార్నింగ్" అని తిరిగి తన కార్యక్రమంలో పడిపోయాడు వాడు. వాడెప్పుడూ అంతే. అదేమిటో మొదటినుండీ వాడికి నేనంటే పడదు. పగలయితే వాళ్లమ్మ, నేను కలిసి మాట్లాడుకోవటానికే వీలులేదు. రాత్రులు కూడా ఒకోసారి మేమిద్దరం ఒకే మంచం మీద ఉంటే మెలకువ వచ్చినప్పుడు చూసి గట్టిగా ఏడ్చేవాడు. వాడి అల్లరిచూస్తే వాళ్లమ్మకు ఏనుగెక్కినంత ఆనందం.

"ఇదన్యాయం. హార్లిక్స్ విషయంలో నువ్వు పక్షపాతం చూపిస్తున్నావు!" అన్నాను సీరియస్‌గా.

"అదేమిటండీ! ప్రొద్దున్నే మీరూ తాగారుగా అధరామృతం?" అన్నట్లుగా చూసి నవ్వింది శ్రీమతి. "పాపా! బాబూ! ముఖం కడుక్కుందురుగాని పదండి" అంది శ్రీమతి తనూ లేస్తూ. పిల్లలు చూడకుండా చిన్నగా గిల్లి, "మీరు వెళ్ళి కడుక్కురండి పాపా!" అన్నాను. "నా కందదు! నాకమ్మే కడగాలి" అన్నాడు బాబుగాడు. నా పని నీరుగారిపోయింది. "మగ్గులో నే నందిస్తాను రారా బాబూ!" అంది పాప. పాప ఎప్పుడూ నా జట్టే. చివరికి ఏమనుకున్నాడో. మౌనంగా అక్క ననుసరించాడు - మొత్తానికి అయిదు నిమిషాల ఏకాంతం చిక్కింది. తిరిగి రాగానే "తలుపు లెందుకేసి ఉన్నాయ్?" అన్నాడు వాడు వచ్చీరాని మాటలతో నన్నుద్దేశించి. చాచి ఒక్కటిద్దామనుకున్నాను. చివరికి శ్రీమతి ఏదో సర్ది చెప్పటంతో తగ్గిపోయాడు నావైపు గుర్రున చూస్తూ.

బిట్రగుంట స్టేషన్‌లో రైలాగింది. అక్కడే కాఫీ టిఫిన్ ముగించాము. బాబుగాడు మాత్రం "నిరాహారదీక్ష" పూనాడు. అరగంటలో నెల్లూరులో ఉంటాం. వరంగల్ నుండి ప్రమోషన్ మీద స్టేషన్ మాస్టరుగా నెల్లూరు వేశారు నన్ను. సాధారణంగా ఇంత చిన్న వయసులో ప్రమోషన్ రావడం అరుదు. పెళ్లయిన నాటినుండీ ఒక్కోమెట్టు పైకి ఎక్కుతున్న నన్ను చూసి అంతా 'బిడ్డొచ్చిన వేళ" అంటూ మొదలుపెట్టారు ఆ మాట విన్నప్పుడల్లా మా శ్రీమతి ముఖం నూనెలో వేసిన పూరీలా ఇంతెత్తున ఉబ్బుతుంది.

నెల్లూరు వచ్చేసింది. మా అత్తగారి ఊరూ అదే కావడంతో అంతా కలిసి [illegible] మోపెట్టైందని మా వాళ్ళు, 'దాని' తరఫు వాళ్ళు చాలామందే వచ్చారు స్టేషన్‌కు. ఇకపోతే మా అసిస్టెంట్లు, పోర్టర్లు, కూలీలు అంతా చాలామంది ఉన్నారు నాకోసం ఎదురుచూస్తూ. స్టాఫ్ నాకు పరిచితులే.



# ప రి ష్కా ర ం

కుశలప్రశ్నలన్నీ అయ్యాక "నమస్కారం బాబూ!" అన్నమాట వినిపించి వెనుదిరిగి చూశాను చిరిగిన పోర్టరుదుస్తుల్లో, పెరిగిన గడ్డంతో కంట్లోనీస్పష్ట "పువ్వు"తో దాదాపు వికారస్థితిలో ఉన్న వ్యక్తి కనిపించాడు రెండు చేతులూ జోడించి.

"నమస్కారం" అన్నాను అప్రయత్నంగానే. అతన్ని ఎక్కడోచూసిన గుర్తు..అతని శరీరంలో వయసు తెచ్చినమార్పు జ్ఞాపకాల నీలినీడలు సోకనీయడంలేదు. "నీపేరు..." అన్నాను అర్ధోక్తిగా. మా అసిస్టెంట్ శ్రీమన్నారాయణ అందుకున్నాడు "వీడిపేరు రాజయ్య..." అంతే ... తర్వాతి మాటలు నాకు వినిపించలేదు. నేనిన్నాళ్ళూ ఎదురు చూస్తున్న అగ్నిపర్వతం లాంటి నిజం బ్రద్దలయింది. ఆ లావాలో ఎక్కడ కొట్టుకు పోతానో అనిపించింది. నాముఖాన అప్పటి కప్పుడే వర్షంలో తడిసినంత ముద్దగా చెమట పట్టేసింది. అందరిదగ్గరా "శహభాష్, గట్టివాడు, టైగర్" వంటి బిరుదులు పొందిన నేను-నాలో ఏమిటి ఈ పిరికితనం? నా ముఖంలో రంగులు మారి ఉంటాయి. ఆ మార్పును ఎవరన్నా పసిగట్టారేమోనని చూట్టూ చూశాను. ఎవరిపనుల్లో వారు న్నారు కనవాళ్ళకు నాతో కున్న ఆనందంలో శ్రీమతి తృప్తిగా ఉన్నది. ఎదుమ పక్క సందర్భో సన్నగా నొప్పి మొదలయ్యింది. తర్వాత అందరం బయలుదేరడం సామానంతా జట్కాలో పెట్టడం, అంత మూ జట్కాల్లో ఎక్కడం, జట్కాలు కదలడం యాంత్రికంగా జరిగిపోయాయి. జట్కాలో ప్రయాణిస్తున్నంతసేపూ నాకు తెలియని బలహీనత, భయం నాగుండెల్లో తాండవిస్తానే ఉన్నాయ్ జరిగిన సంఘటనగా చీకటిల్లో, ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్లుగా ఉంది.

ఇంటికి వచ్చినవెంటనే వేడి నీళ్ళు రెడీగా ఉన్నాయ్. స్నానముచేసి పించి శ్రీమతిని కేకేశాను. మేడమీద పడక ఏర్పాటు చేసింది శ్రీమతి పరుపుమీద మేను వాల్చాను గుండెల్లో నొప్పికాస్త తగ్గింది కానీ దడ యింకా పూర్తిగా తగ్గలేదు పైన ఫేను గిర్రున తిరుగుతోంది శబ్దం చేస్తూ ఎంతకన్నా పెద్ద పోటుతో నడుంలోనొప్పి మొదలయింది ఫానుకన్నా వేగంగ జ్ఞాపకాలు మస్తిష్కంలో తిరుగుతున్నాయి. రాజయ్య!... రాజయ్య!... రాజయ్య! రాక్షసుడంత ఆకారంలో రాజయ్యనా ఎదురుగా నిలబడ్డాడు. వద్దనుకుంటూనే గతం తవ్విన జ్ఞాపకాలలోకి జారిపోయాను.

అవి నేను ఉద్యోగంలో ప్రవేశించిన తొలి రోజులు......

నన్ను రిలీవింగ్ అసిస్టెంట్ స్టేషన్ మాష్టరుగా నంద్యాల వేశారు. క్రొత్త ఉద్యోగం. క్రొత్త మనుషులు, క్రొత్త ఊరు లంతా క్రొత్తే. ఉడుకు రక్తం ఏమో తల బిరుసుగా ప్రవర్తించేవాణ్ణి. ఎవరన్నా లెక్క చేసేవాణ్ణి కాదు. నాయీ పద్ధతులు గమనించి చాలామంది తలకోవిధంగా నా గురించి చిలవలు, పలవలు చేర్చి నన్నో "పొగరుబోతు, త్రాగుబోతు. తిరుగుబోతు"గా మా బాస్ — స్టేషన్ మాష్టరుకు చెప్పేవారు. నిజానికి చివరి రెండు బిరుదులూ నా విషయంలో నిజంకాదు. ఎలాగా, బలంగా కన్పించే నేను అలాంటివాడినంటే మా బాస్ నమ్మేవారు కాదు. చివరికి నమ్మి, నన్ను తన పరిధిలో ఉంచుకోవాలని ప్రయత్నించడం చాలా తీవ్రంగానే ప్రారంభించారు - ఎంత నొక్కిపెట్టాలని ప్రయత్నిస్తే అంతగా బయటపడాలని చూస్తుంది. అదే నా విషయంలోనూ జరిగింది. ఫలితం స్ప్రింగ్ మరింత ఎగిరి ...

ఆ తగూ ఫలితంగా నన్ను "కొండాపురం రోడ్డు" స్టేషన్‌కు వేశారు. నేను రిలీవింగ్ కాబట్టి నంద్యాల జ్యాంక్షన్ డిక్షన్ క్రింద ఉన్న స్టేషన్‌లలో ఏ స్టేషన్‌కువేసినా వెళ్ళాలి. "కొండాపురం రోడ్" నంద్యాలకు పన్నెండు కిలోమీటర్ల దూరంలో నంద్యాల జ్యాంక్షన్ డిక్షన్ క్రిందే వుంది.

"ఇంత కంటే నన్నేంచేస్తారులే" అని బయల్దేరాను. పైగా అది టి. ఏ. వచ్చే స్టేషను. మూటా ముల్లె సర్దుతున్న నన్ను చూసి "హాయిగా ఉన్న ఊళ్లో నాచేత పంపు లింటూ పనుంచక నీకిదేం పొయ్యేకాలంరా నాయనా!" అంది మా బామ్మ బుగ్గలు నొక్కుకుంటూ—

"నీకు తెలీదులే ఊరుకో" అనిచిన్న కసురులో ఆమె నోరు మూశాను.

అంతరూ స్వయంగా అయినా ఒకరిద్దరు మంచిమిత్రులు రేకపోలేదు. "కొండాపురం రోడ్ అడవిస్టేషను. పైగా దయ్యాలు, గ్రామ లిపుపచ యంటారు అంతా జూదరులు, వ్యభిచారులకొంప..." యిలాంటి నేని వారిమాటలు. వారిమాటలు వింటుంటే నాకుబిలి కఫిలు వచ్చాయి.

సాయంత్రం ఆరున్నరగంటల బండిలో భోజనం తీసుకుని బయల్దేరాను. "కొండా పురం రోడ్" చాలా చిన్నస్టేషన్. ఒగ్గరలో ఊరేమీలేదు. "కొండాపురం" వెళ్ళేరోడ్ కాబట్టి దానికాపేరు వచ్చింది. అక్కడుండేది ఇద్దరే. ఒక ఏ. ఎస్. ఎమ్, ఒక ఏ. ఎస్. ఎమ్. నేను ఏ. ఎస్. ఎమ్‌ను కాబట్టి కంపల్సరీగా సైదిగ్యాటిన్ చేయాలి. పోర్టర్లు కూడా యిద్దరే. పగలు ఒకరు. రాత్రి ఒకరు. రాత్రి ఎనిమిదిగంటలనుండి ఉదయం ఎనిమిదిగంటల వరకు నాడ్యూటీ అన్నమాట. ఎనిమిదింటికి డ్యూటీపోండోవర్ చేసి ఎస్. ఎమ్. వెళ్ళి పోయాడు. క్యాష్ చెక్‌చేసి, కీస్ చెక్‌చేసి ఛార్జి తీసుకున్నాను.

"కొండాపురంరోడ్" బ్రాంచిలైన్లో ఉంది కాబట్టి బండ్లు ఎక్కువగా ఏమీఉండవు. రాత్రి 11 గం.కు ఒకటి, ఒంటిగంటకొకటి ఈ రెండుబండ్లు నాడ్యూటీలో తగులుతాయి. పోర్టర్ ప్రకారం పేరు సైదాఅనీ. రాత్రి రాజయ్య, అనీ తెలుసుకున్నాను.

"రాజయ్యా! ......" అని కేకేశాను.

పోర్టర్ వచ్చాడు "క్యా సాబ్..." అంటూ

అతని వేష భాషలనుబట్టి అతను సైదా అని తెలుస్తూనే ఉన్నది.

"సైదా! నువ్వింకా ఉన్నావేం? రాజయ్యేడీ?" అన్నాను.

"వాడికూతురికి జబ్బుచేసిందట సాబ్! ఈ రాత్రికి నేనే చేస్తాను"

"ఓ! కంటిన్యూ. చేయగలవా?" లన్నాను.

"చేస్తాను సాబ్! ఎవరికైనా పస్తుంది కష్టం ఏం చెప్తున్నారు సాబ్!" అన్నాడు

"ఏమీవద్దు. కాస్త మంచినీళ్ళు తెచ్చి పెట్టు" అన్నాను.

నీళ్ళు తెచ్చాక "నేను వెళ్ళి క్యాబిన్‌లో పడుకుంటానని" వెళ్ళి పోయాడు వాడు.

స్టేషన్‌కు కరెంటు దీపాలు లేవు. లోపల హరికేన్ లాంతరు వెలుగుతోంది మినుకు మినుకు మంటూ. బయట వాతావరణం చూడాలన్పించింది. త్రీ సెల్ టార్చ్ లైటు తీసుకుని బయటికి వచ్చేను. చిన్న సైజు ఆ ప్లాట్‌ఫారంపైన ఆ చివర, ఈచివర వెలుగుతున్న కిరసనాయిలు లాంతర్లు, వాటిచుట్టూ ప్రసరిస్తున్న వెలుగు తప్పించి మిగతా అంతా చీకటే. దూరంగా సిగ్నల్‌కు పెట్టిన ఎర్ర లైట్లు వెల్గుతున్నాయి. ఇరవై గజాల దూరంలో క్యాబిన్, దానికివతల ప్యాసింజరు హాలు, ఎదురుగా రైలు పట్టాలు. వాటికవతల పెద్దఅడవి. అడవి మధ్యలో జడలు విరబోసుకుని అక్కడక్కడా పెద్ద చెట్లు. అడవిలో దూరంగా వెల్గుతున్న గుడ్డి వెల్తురును బట్టి అక్కడ పాకలాంటిది ఉండి తీరాలని నిర్ణయించుకున్నాను. ప్లాటుఫారం పైన ఒక్క మనిషికూడా లేడు. ఒకరిద్దరు వచ్చినా బండి వచ్చేసమయానికి వస్తారని తెలుసుకున్నాను.

నేను సిగ్నల్ దగ్గర చెట్ల నీడపడి చీకటిగా ఉంది. ఇంతలో 'సర్' మని శబ్దం

విన్పించింది. వెంటనే టార్చి ఫోకస్ చేశాను నా గుండె గుభేల్ మంది. టార్చి వెల్తుర్లో నిగనిగలాడుతూ నల్లత్రాచు...! అంతే! ఒక్క ఉదుటున ఆఫీసులోకి వచ్చిపడ్డాను.

అంత పెద్ద పామును అంత దగ్గరగా అంతవరకూ చూసి ఉండలేదు. ముఖంమీద ముచ్చెమటలు పోశాయ్. తర్వాత పదిగంటల ప్రాంతంలో బయట ఒకరిద్దరు ప్యాసింజర్లు మాట్లాడుకోవటం విన్పించింది. ఒంటిగంట బండి పోగానే పడకేసి తిరిగి ఐదింటికిలేచాను! ప్రతి బండికీ సైదా వచ్చి గంట కొట్టి, టికెట్స్ కలెక్ట్ చేసి యిచ్చేవాడు మొదటి రోజు అలా గడిచిపోయింది. రోజూ సాయంత్రం ఆరున్నర గంటల బండిలో నంద్యాల నుండి భోజనం తీసుకుని వచ్చి ఉదయం ఏడు గంటల బండిలో నంద్యాల చేరుకోవచ్చు!

మర్నాడు కూడా రాజయ్య రానేలేదు. నాలో సహనం నశించింది. సైదా చేత కబురు పెట్టాను ఒకసారివచ్చి కనపడిపొమ్మని. ఫలితం శూన్యం! ఆరోజుకూడా రాజయ్య రానేలేదు.

మూడవరోజు నేను కొండాపురంరోడ్ చేరుకునేప్పటికే బాగా మసురుపట్టేసిఉంది ఆకాశం. పౌర్ణమినాటి చంద్రుణ్ని తమ కబంధ హస్తాలలో బంధించివేశాయి మేఘాలు. అంతా చీకటిగా ఉంది. తొమ్మిదిగంటల ప్రాంతంలో హోరునగాలి, గాలితోపాటు వర్షం మొదలయాయి. పగలంతా ఎండతీవ్రతకు వేడెక్కిన భూమి వర్షం కురవడంతో చల్లబడి 'అదో రకమ'యిన సువాసన వెదజల్లుతోంది బయట వెలిగించిన లాంతరుస్తంభాలు ఆరిపోయాయి. ఆఫీసురూములో వెల్గించిఉన్న లాంతరు, వెలుగును రూమంతటికీ సమానంగా పంచలేకపోతోంది. వర్షంమూలంగా ఏమో రోజూ వచ్చే ఒకరిద్దరు ప్యాసింజర్లుకూడా లేరు.

పదకొండు గంటల బండి పోగానే క్యాష్ బుక్‌తో లెక్కలువేస్తూ కూర్చున్నాను.



మ్రోగింది... వీణా...పదే..పదే..హృదయాలలో......



# పరిష్కారం

యుల్లు కొట్టడంమూలాన తలుపులు, కిటికీలు వేసే ఉన్నాయి. మినుకు మినుకు మంటున్న ఆ లాంతరువెలుగులో నాపని సాగడం కష్టంగా ఉన్నది. లాంతరుపొగ, గాలిలేని ఆ రూము వాసన 'అదో'లా అన్పించసాగాయి. వీలైనంత త్వరగా 'కొండాపురంరోడ్' నుండి వెళ్ళిపోవాలనుకున్నాను. లుంగీకట్టుకుని, కాళ్ళు పైకెత్తి కూర్చుని, నాపనిలో నేను ఉన్నాను. అప్పుడప్పుడూ ఉరుముతున్న మేఘాలశబ్దం, బయటసన్నగా పడుతున్న వర్షపు చినుకుల శబ్దంతప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది ప్రకృతి.

చిన్నగా అడుగుల చప్పుడు విన్పించింది. తలెత్తి చూశాను. నేను వేసినతలుపులు వేసినట్లే ఉన్నాయి. తిరిగి నా పనిలో పడిపోయాను. తర్వాత గాజులసవ్వడి, బకెట్‌లో నీరు ఎవరో వంపుతున్న శబ్దం విన్పించింది సైదావేమో అనుకున్నాను. గట్టిగా 'సైదా!' అని కేకవేశాను. జవాబులేదు. పోనీ ఎవరైనా ప్యాసింజర్లేమో అనుకోవడానికి అది ఎటూ కానివేళ. ఆ అడుగులశబ్దం చిన్నగా కిటికీ వద్దకు వచ్చి ఆగిపోయింది.

ఎవరో కిటికీ తెరవడానికి ప్రయత్నిస్తున్నట్లు అర్థమైంది. నా గుండెలు వేగంగా కొట్టుకొంటున్నాయ్. నా చేయి ప్రక్కనేఉన్న టార్చి లైట్‌కు బిగుసుకున్నది. ప్రస్తుతం నా వద్ద ఉన్న ఆయుధం అది ఒక్కటే.

వారగా వేసివున్న తలుపులు 'కిర్రు'న శబ్దం చేస్తూ చిన్నగా తెరచుకొన్నాయ్. నేను మూసి ఉన్న కిటికీలకేసి, ద్వారం కేసి మార్చి మార్చి చూడసాగాను భయంతో ఊపిరి బిగబట్టి.

ఎవరో కిసుక్కున నవ్వినట్లయింది. ఐదున్నరడుగుల పొడవుగల ఆకారం ద్వారంలో కొచ్చింది. నా గుండె ఒక్క క్షణం ఆగి, తిరిగి పనిచేయడం ప్రారంభించింది. లాంతరు వెలుగులో స్పష్టంగా గుర్తించాను. ఆ ఆకారం యవ్వనంలో ఉన్న స్త్రీ! వేసుకున్న బట్టలు వర్షంలో తడిసి నీళ్ళు కారుతున్నాయ్. నేను ఆమె వైపే చూస్తున్నాను నిలువు గుడ్లతో.

"ఓ! క్రొత్త మాస్టారా!" అంది. మళ్ళీ అదే నవ్వు.

నేను సడలిపోతున్న ధైర్యాన్ని కూడదీసుకుని టార్చ్‌ను ముఖానికి ఫోకస్ చేశాను. అంతే! 'కెవ్వు'న కేకపెట్టి ఒక్కసారిగా పరుగు లంకించుకుంది. వెలుగుతున్న టార్చి వెలుతుర్లో వెళ్ళిపోతున్న ఆ ఆకారాన్ని స్పష్టంగా గుర్తించాను. ఆమె తెల్లని దుస్తులు ధరించి వుంది. నేను చూసిన నల్లత్రాచును మరిపించే బారెడు జుట్టు గాలిలో ఎగురుతూ కన్పించింది. ఆ ఆకారం కనురెప్పపాటులో అడవిలో దూరి మాయమయింది. ద్వారంలో ఆమె నిల్చున్న మేరకు నీళ్ళు పడి తడిగా ఉన్నది, అర్థంకాని ఆలోచనలతో ఆ రేయి తెల్లవారింది.

(ఇంకా వుంది)






**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**




# నిప్పో

లీక్-ప్రూఫ్ బ్యాటరీలు

## చిరకాలపు మన్నికతో కూడిన సాటిలేని శక్తిగలవి

నిప్పో హైపర్ మరియు హై-టాప్ బ్యాటరీలలో ఎలక్ట్రోలిటిక్ మేంగనీస్ డయాక్సైడ్ ఎక్కువగా ఉంటుంది. ఇది బ్యాటరీయొక్క శక్తినీ, మన్నికను అధికం చేస్తుంది. అంతేగాకుండా బ్యాటరీ దానంతటదే శక్తిని పోగొట్టుకోవడాన్ని తగ్గిస్తుంది.

### మెటల్ జాకెట్ వలన రక్షణ

పేటెంట్ చేయబడిన లీక్‌ప్రూఫ్ నిర్మాణంగల నిప్పో బ్యాటరీలు లోపల వినైల్ కేసింగ్ గలిగి మెటల్ జాకెట్‌తో నిర్మింపబడ్డాయి. దీనివలన మీ ఉపకరణములకు హాని చేసే తేమ, లీకేజ్ నిరోధింపబడుతుంది.




జపాన్ దేశపు **నేషనల్** వారి
సాంకేతిక విజ్ఞానంతో

ఇండో నేషనల్ లిమిటెడ్ వారిచే తయారుచేయబడినవి

